# పాణిగ్రహణము

—వివాహమంత్రార్థము—

ర చ యి త

శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రి

# పాణిగ్రహణము

—వివాహమంత్రార్థము—

ర చ యి త

శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రి

శ్రీమద్దివ్యమహర్షి దంపతినుత
శ్రీవైభవాలంకృతుల్
ప్రేమానోన్యన్యనిబద్ధమానసలస
త్తృప్తుల్ పురాదంపతుల్
ప్రేమాసక్తుల నూత్న దంపతుల శ్రీ
శ్రీపాదవంశస్థులన్
శ్రీమందేశ్వరశాస్త్రి భానుమతులన్
శ్రీ లిచ్చి రక్షించుతన్

ప్రమాధి. మార్గశీర్ష
శుద్ధ త్రయోదశి.
కాకినాడ.

శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రి.

# చిన్నమనవి

**ఆర్యులారా!**

దేశకాలపరిస్థితులనుబట్టి ప్రతివిషయమునను సంస్కారణము పరుగులమీఁద జరుగుచున్నది. పూర్వాపరస్థితు లెఱిఁగి చేసినసంస్కారణము లోకహితము. ప్రపంచమున కాధారమైన స్త్రీపురుషసంబంధము ప్రేమమూలకము ప్రేమయే ప్రపంచమును నడిపించుచున్నది.పరస్పరమును ప్రేమపాత్రమగు దాంపత్యమును, తత్సుఖమును ధ్రువముగా నుండునట్లు చేయుటకై ప్రతిదేశమునను ప్రతిమతమునను కొన్ని కట్టుఁబాట్లు చేసికొనుట సహజము. ఆకట్టుఁబాట్లే వివాహవిధు లగును. మనపూర్వులు వారి యాచరణలో నున్నపద్ధతులను మంత్రములలోను సూత్రములలోను నిబంధించిరి. అవి తెలిసికొనుటకుఁ గావలసిన విద్యాసంస్కారము మనదేశమునఁ దగ్గిపోయినది పైపెచ్చు, పరదేశస్థులపద్ధతులను వినుటయును, కనుటయును హెచ్చాయినది. ఆసంస్కారమునుబట్టి పెద్దలకును, పిన్నలకును గూడఁ గొన్ని వ్యతిరేకభావములు గలుగుచున్నవి. మనపద్ధతులను తెలిసికొనఁదలఁచినవారికి సాధనములు గానరావు. ఆలోపమును దీర్చుటకై కొంత యత్నముచేయవలయు ననెడి యభిలాష యుండెను గాని అది సాగలేదు.

ప్రకృతము నాకుమారునివివాహము కొలఁదిదినములలో నుండఁగా వివాహమంత్రములలోని ముఖ్యవిషయములు వినుటకుఁ దనకుఁ గూతూహలము గల దని యాతఁ డనఁగ సంతోషించి ముఖ్యవిషయములను దెలిపితిని. వివాహము చేసికొనఁదలఁచినవారిలోను వివాహముచేసికొనినవారిలోను గూడఁ గొందఱ కట్టికుతూహల ముండునుగాన నట్టివారి కుపయోగించుటకై పాణిగ్రహణమను పేరితో వివాహమంత్రార్థమును రచించితిని. ఆతని వివాహమహోత్సవమునాఁటికే యిది ప్రకటింపవలయు నని తలఁచి త్రిరాత్రదీక్షతో రచించి ముద్రింపించితిని. ఇందు విడువఁబడినభాగములు దీనికిఁ బరిశిష్టముగా ముందుముందు ప్రకటింపఁ దలంపు గలదు. గుణదోషవిచారణమును, ఉపయోగానుపయోగనిర్ణయమును పాఠకాధీనములు.

రెండుమూఁడు దినములలో నిది ముద్రించుట కేర్పాటు గావించిన భాషోద్ధారక శ్రీ వావిళ్ల వెంకటేశ్వరశాస్త్రులవారికిని వారిసిబ్బందివారికిని నాకృతజ్ఞతలు దెలుపుదును.

శ్రీపాదభవనము,
ట్రిప్లికను, చన్నపురి
20-12-39

ఇట్లు
విధేయుఁడు,
శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రి.

శ్రీః

# పాణిగ్రహణము.

పాణిగ్రహణ మనఁగా చేయి పట్టుకొనుట. వివాహము నందు వరుఁడు వధువును చేయిపట్టుకొని యగ్నిసమీపమునకుఁ దీసికొనిపోయి యచట సప్తపదములు నడిపించి సఖ్యమును స్థిర పఱచుకొనును. వివాహమున కంతకును సప్తపది ముఖ్యము. దానికి సాధనమగు పాణిగ్రహణము ముఖ్యతరము గావున వివాహమునకుఁ బాణిగ్రహణ మను పేరు ప్రసిద్ధ మయినది.

ఆపాణిగ్రహణమునందు జరుగు ప్రక్రియను సంగ్రహముగాఁ దెలుపుచు నడుమనడుమ ముఖ్యమంత్రములకుఁ దాత్పర్యముఁ దెలుపఁదలఁచితిని.

## వరలక్షణము.

పాణిగ్రహణము చేసికొనఁదలఁచినవానికి వరుఁడని పేరు. వివాహమున గ్రహింపఁబడు కన్యకకు వధువని పేరు.

వరలక్షణము:—వరునిలక్షణములను కొన్నిటిని జెప్పి చిట్టచివర "బంధుశీలలక్షణసంపన్నశ్శ్రుతవా నరోగశ్చ" అని యాపస్తంబుఁడు చెప్పెను. అనఁగా బంధువులుగలవాఁడును, మంచిగుణములుగలవాఁడును, సాముద్రికశాస్త్రమునఁ జెప్పఁబడిన శుభలక్షణములుగలవాఁడును, వేదవేదాంగములు చదివినవాఁ

డును, అపస్మారకుష్ఠాద్యసాధ్యరోగములు లేనివాఁడును గావల యును.

## కన్యాలక్షణము.

సూత్రకారులు కన్యాలక్షణము లనేకములు చెప్పి "బంధుశీలలక్షణసంపన్నా మరోగా ముపయచ్ఛేత" బంధువులు గలదియు మంచిగుణములును శుభలక్షణములును గలదియు దుస్సాధరోగములు లేనిదియు నగు కన్యకను పెండ్లాడవలెను అనియు, "యస్యాం మనశ్చక్షుషో ర్నిబంధః." వరునకు ఏకన్యక యందు మనస్సునకును కంటికిని ఆసక్తి (తగులము) గలుగునో అట్టి కన్యకయే వానికి వివాహముచేసికొనఁ దగినది అనియు ప్రధానలక్షణములనుఁ జెప్పిరి తనమనస్సునకును కంటికిని నచ్చుటయే ముఖ్యలక్షణము.

వేదవేదాంగములు పూర్తిగా నభ్యసించి స్వశక్త్యార్జిత ధనముతో గురువు కోరిన దక్షిణ నిచ్చి సంతృప్తిపఱచి గురువు ననుజ్ఞఁ బొంది స్నాతకవ్రత మాచరింపవలయును బ్రహ్మచర్య వ్రతలోపప్రాయశ్చిత్తము చేసికొని, దర్పణదర్శనమును దండ ధారణము, ఛత్రధారణము పరిమళద్రవ్యగ్రహణము క్షురము, మొదలగునవి స్నాతకవ్రతమందు మంత్రపూర్వకముగా గ్రహించును. అవి గ్రహించి తన మిత్రునితోఁ దనయూహలు తనశక్తి సందర్భములను తెలిపి భావి జీవితమున నవివాహితుఁడై సన్న్యాసాదిధర్మము లవలంబించుటయో వివాహముచేసికొని గృహస్థ

ధర్మ మవలంబించుటయో నిశ్చయించు కొనవలెను. ఛత్రాది ధారణముచేసి కాశ్యాది దేశయాత్రకుఁ బోవుచు మార్గమధ్యమునఁ బలుకరించినవానితో నిట్లనును.

| | |
|---|---|
| "చరితబ్రహ్మచర్యోఽహం కృతవ్రతచతుష్టయః, కాశీయాత్రాం గమిష్యామి అనుజ్ఞాం దేహి మే శుభామ్." | నేను బ్రహ్మచర్యవ్రత మాచరించి వేదవ్రతములుచేసినవాఁడను కాశీయాత్రకుఁ బోవుచున్నాను. నా కనుజ్ఞయిమ్ము. |

ఆతఁడు తిరిగి యిట్లనును.

| | |
|---|---|
| "సాలంకారాం మమసుతాం కన్యాం దాస్యామి తేద్విజ, పాణిం గృహీత్వా సాగ్నిస్త్వం గచ్ఛస్వాగచ్ఛ మద్గృహమ్." | ఓద్విజుఁడా! అలంకారసహితయగు నాకన్యను నీకిచ్చెదను. దీనిని బెండ్లాడి అగ్నిహోత్రసహితుఁడవై వెడలుము. నాయింటికి రమ్ము. |

ఇదే పెండ్లికొడుకు కాశీయాత్రగాఁ బరిణమించినది. ఇది సూత్రకారుఁడు చెప్పిన కన్యావరణాదిప్రక్రియకు విరుద్ధముగాఁ గనఁబడుచున్నది కాని మంత్రసంస్కారసహితమగు కన్యావరణము వ్యర్థముకాకుండఁగ కన్యాదాత యభిప్రాయము ముందే తెలిసికొనఁ దగునుగాన నిందు కన్యావరణప్రక్రియకు విరోధములేదని కొందఱు సమర్థింతురు. వరుఁడే తనమిత్రులను బంపి యొకకన్యకను తననిమిత్తము వరించి రండని పంపునుగాని కన్యాదాత నాకన్యకను నీకిచ్చెదను రమ్మనుట యాపస్తంబబుషిసమ్మతముకాదు. కన్యాపిత వరాన్వేషణముచేయుట యాచారము

లోనికి వచ్చినతర్వాత పైరీతి యేర్పడి యుండును. అదే ఆచారమైనది స్నాతకవ్రతానంతరము గృహస్థధర్మ మవలంబింపఁగోరువాఁడు వరుఁడు.

వరుఁడు పాణిగ్రహణాఖ్యమగుకర్మ నాచరింపఁదలఁచి నిర్విఘ్నపరిసమాప్తికై గణపతిపూజయు, శుద్ధ్యర్థమును వృద్ధ్యర్థమును అభ్యుదయార్థమును మహాజనులతో స్వస్తిపుణ్యాహవాచనము చేసికొనవలెను.

## కన్యావరణము.

“సుహృదస్సమవేతాన్ మంత్రవతో వరాన్ ప్రహిణుయాత్.”

తనకు మిత్రులును, తననుగుఱించి సమానాసక్తిగలవారును మంత్రవంతులును అనఁగా వేదవేత్తలు అనిగాని ఆలోచనగలవారు అనిగాని చెప్పవచ్చును. అట్టి వారిని నలుగురను పంపవలయును.

వారితో ఇట్లు చెప్పవలెను—

“మదర్థం కన్యాం వృణీధ్వమ్.”

నానిమిత్తము కన్యను వరింపుఁడు.

“తా నాదితో ద్వాభ్యా మభిమంత్రయేత.”

వారిని (మంత్రప్రశ్నమున మొదటనున్న రెండు మంత్రములతోను) నభిమంత్రింపవలెను. అభిమంత్రించుట యన నభిముఖముగా నుండి మంత్రములు పఠించుట.

"ప్రసుగ్మంతా ధియసానస్య సక్ష
ణి వరేభిర్వరాగ్ం అభిషుప్రసీ
దత, అస్మాక మింద్ర ఉభయం
జుజోషతి య త్సౌమ్యస్యాం
ధసో బుబోధతి, అనృక్షరా
ఋజవ స్సంతు పంథా యేభి
స్సఖాయో యంతి నో వరే
యం, సమర్యమా సంభగో నో
నినీయా త్సంజాస్పత్యగ్ం సు
యమ మస్తు దేవాః."

మిత్రులారా! బాగుగాను వడి
గాను ప్రయాణముచేయఁగల మీ
రు నేను తలఁచినక్షణముననే శ్రేష్ఠ
మగుమార్గముల వరింపఁదగిన కన్యా
వంతునిగురించి వెడలుఁడు. నాకును
కన్యకకును సంయోగము గలుగుట
ఇంద్రునకును సమ్మతమే. వధూవరు
లిద్దఱును గలసినయెడల యాగ
మున సోమరసాత్మకమగు నన్న
మును దనకు ఇచ్చెద రని యాతఁ
డెఱుఁగును. కావున మీకు ఇం
ద్రుఁడును సహాయుఁ డగును.

నామిత్రులు కన్యావంతుని గృహ
మున కేమార్గములఁ బ్రయాణము
చేయుదురో ఆమార్గములు ముళ్లు,
రాళ్లును లేనివియై ఋజువులుగా
నుండుఁగాక. ఓ దేవతలారా! మా
(భావి) దాంపత్యము సుసంబద్ధ
మగుఁగాక.

కన్యాదాత కుమారికాయుష్యాభివృద్ధికై గౌరీ-కంకణ
పూజచేసి కన్యక యెడమచేతికి రక్షాబంధనము కట్టును. అప్పుడు

కన్యను ధాన్యపుమూటమీఁదనో బియ్యపుదట్టిలోనో కూర్చుం డఁబెట్టెదరు. అది ధనధాన్యాదిసమృద్ధిని సూచించును. దీనికి ఆచారమే ప్రమాణము.

| | |
|---|---|
| "తే కన్యాదాతారం గత్వా బ్రువతే." | వారు కన్యాదాతయొద్దకుఁబోయి చెప్పుదురు. |

వరప్రవరగోత్రములు చెప్పి వరుని తండ్రి తాత ముత్తా తలపేర్లు తెలుపుచు కన్యను కోరవలెను. దానికి దృష్టాంతముగా నివి గ్రహింతము.

వైశ్వామిత్ర, అఘమర్షణ, కౌశిక త్రయార్షేయప్రవరా న్వితకౌశికసగోత్రస్య లక్ష్మీపతిసోమయాజిశర్మణో నప్త్రే, వైశ్వామిత్ర...గోత్రస్య మందేశ్వరశాస్త్రిశర్మణః పౌత్రాయ, వైశ్వామిత్ర......గోత్రస్య లక్ష్మీపతిశాస్త్రిశర్మణః పుత్రాయ, వైశ్వామిత్ర ... కౌశికగోత్రోద్భవాయ మందేశ్వరశాస్త్రిశర్మణే వరాయ

అట్లే కన్యాప్రవరయు గోత్రమును తండ్రి, తాత, ముత్తాతలపేర్లను దెలుపవలెను.

ఆంగీరస, బార్హస్పత్య, భారద్వాజ త్రయార్షేయప్రవరా న్విత భారద్వాజసగోత్రస్య లక్ష్మీనారాయణశాస్త్రిశర్మణో నప్త్రీం, ఆంగీరస.........గోత్రస్య వీరేశ్వరశాస్త్రిశర్మణః పౌత్రీం, ఆంగీరస......గోత్రస్య లక్ష్మీనారాయణశాస్త్రిశర్మణః పుత్రీం, భారద్వాజసగోత్రోద్భవాం భానుమతీ నామ్నీం కన్యాం

| | |
|---|---|
| "ధర్మప్రజాసంపత్త్యర్థం వృణీమహే." | ధర్మప్రజాసంపత్త్యర్థము వరింతుము. |
| "వృణీధ్వం దాస్యామీతి ప్రతిబ్రూయాత్." ఏవంత్రిః. | వరింపుఁడు ఇచ్చెదను అని కన్యావంతుఁడు ప్రతివచనము చెప్పవలెను. ఇట్లు ముమ్మాఱు జరుపవలెను. |
| "కృతార్థా వయ మితి వర మావేదయేయుః." | మేము కృతార్థుల మైతి మని వారు వరునితోఁ జెప్పుదురు. |

తర్వాత వరుఁడు

| | |
|---|---|
| "ధర్మప్రజాసంపత్త్యర్థగ్ంస్త్రియ ముద్వహే." | ధర్మప్రజాసంపత్త్యర్థము స్త్రీని వివాహముచేసికొనెదను. |

అని సంకల్పముచేసి వివాహాంగమగు ద్వితీయయజ్ఞోపవీతమును ధరించును.

కన్యాదాత ప్రాణాయామముచేసి

| | |
|---|---|
| "లక్ష్మీనారాయణప్రీత్యర్థం సాలంకృతకన్యాదానం కరిష్యే." | లక్ష్మీనారాయణప్రీతికై సాలంకృతకన్యాదానము చేయుదును. |

అని సంకల్పముచేసి మహాసంకల్పము చెప్పి వరుని పూజించి శ్రీలక్ష్మీనారాయణస్వరూపునిగా వరుని భావించి ఆసనము ఇచ్చి, పాద్యమిచ్చి కాళ్లు కడిగి

“నమోస్త్వనంతాయ సహస్రమూర్తయే
సహస్రపాదాక్షిశిరోరుబాహవే
సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే
సహస్రకోటీయుగధారిణే నమః.” అని

గంధాలంకారాక్షతాదు లిచ్చి పూజ పూర్తిగావించును.

| | |
|---|---|
| “కన్యాం కనకసంపన్నాం | బంగారముతోఁ గూడినదియును |
| కనకాభరణైర్యుతాం, | బంగారపునగలు గలదియు అగు |
| దాస్యామి విష్ణవే తుభ్యం | కన్యను ధర్మకామార్థసిద్ధికై విష్ణు |
| ధర్మకామార్థసిద్ధయే.” | స్వరూపుఁడవగు నీ కిచ్చెదను. |

“బ్రహ్మలోకజిగీషయా” అని చివరపాదమునఁ గొందఱు పఠింతురు.

అని కన్యాప్రవర చెప్పి—నప్త్రీయు, పౌత్రి, పుత్త్రియు, నామ్ని అగుకన్యకను–నప్తయు–పౌత్త్రుఁడును–పుత్త్రుఁడును–అను పేరుగలవరుఁడవగు నీకు “తుభ్యం ప్రజాసహత్వకర్మభ్యః ప్రతిపాదయామీతి కన్యా ముదకపూర్వకం దద్యాత్” సంతతికొఱకును లౌకికకార్యములందు సహవాసముగా నుండుటకును కర్మాచరణకొఱకును ఈకన్యకను ఇచ్చుచున్నాను. అని కన్యకను ఉదకపూర్వకముగా దానము చేయవలెను.

వరుఁడు ‘స్వస్తీతి ప్రతివచనం’ స్వస్తి యని ప్రతివచనము (అంగీకారసూచకముగా) చెప్పవలెను.

“కన్యాదానసాద్గుణ్యార్థం దక్షిణాం తుభ్య మహం సంప్రదదే న మమ” అని దాత కన్యాదానదక్షిణ నిచ్చును.

దాత వరునితో "ధర్మార్థకామేషు త్వ యైషా నాతిచరితవ్యా" ధర్మమందును అర్థమందును కామమందును నీవు దీని నుల్లంఘించి చరింపరాదు. అనఁగా, వరుఁడు 'నాతిచరామి' ధర్మార్థ కామములందు ఈవధువును నుల్లంఘించి చరింపను అని ప్రతివచనము చెప్పును. ఇదియే వరుఁడు కన్యాదాత కిచ్చు వాగ్దానము. వరుఁడు వివాహవేదికయందు అగ్నిప్రతిష్ఠాపనముచేయును.

## మధుపర్కము.

మధుపర్క మనఁగా మధువు (తేనె)తోఁ గలిపినది. అని అర్థము. అతిథి, ఋత్విక్కు, రాజు, శ్వశురుఁడు, వరుఁడు, అపచితుఁడు (వరుని గురువు తండ్రి మొదలగువారు) వచ్చినపుడు తేనె, పెరుగు కలిపి భక్షించుట కీయవలయును. కొందఱు తేనె, పెరుగు, నెయ్యి మూఁడును కలుపవలయు ననిరి. కొందఱు పైమూఁటితోను ధానలు (వేపుడుబియ్యము లేక బొరుగులు) సక్తువు (పేలాలపిండి) కూడఁ గలిపి యయిదుద్రవ్యములు కలసిన పదార్థమును ఈయవలయు ననిరి.

ఆమధుపర్కమిచ్చునపుడు పూర్వయుగములందు గోవును (ఆవును) ఇచ్చెడివారు. దానిని హింసించి దానివపను దీసి వెచ్చ చేసి ఆజ్యముతోఁ గలిపి హోమము చేసెడివారు. కలియుగమందు గవాలంభము నిషిద్ధముగాన ఉత్సర్జనమును (ఆగోవును గడ్డితిని నీళ్లు త్రాగి స్వేచ్ఛగా బ్రతుకుఁగాక యని విడిచిపెట్టుటను) అవలంబించిరి. ఆలంభనపక్షమున వపాహోమమును ఉత్స

ర్జనపక్షమున మంత్రజపమును సూత్రమున విహితము లయ్యెను. ఇదియే గోమధుపర్కము.

వివాహమునందు వరుని అతిథిని పూజించునట్లు పూజింప వలెనుగాన మధుపర్క మిచ్చెదరు. దానివిధానము:—వరుని సమీపమునకు వధువును తీసికొనివచ్చి కూర్చుండఁబెట్టుదురు. వరుఁడు వధువును మంత్రసంస్కారపూర్వకముగా సుముహూర్తమునఁ జూడవలెను గావున వధూవరులకు నడుమఁ దెర అడ్డుగాఁ బట్టుదురు. కన్యాదాత కుమారియాయుష్యాభివృద్ధ్యర్థమై వరుని మధుపర్కద్రవ్యముతోఁ బూజించెద నని సంకల్పము చేసి మంత్రసహితముగా వరునికి కూర్చుండుటకు కూర్చమును పాదప్రక్షాళనమునకు పాద్యమును ఇచ్చి వరుని కాళ్లుకడిగి మట్టి పాత్రతో అర్ఘ్యమును ఇచ్చి ఆసందర్భమున వస్త్రములు గోవులు మొదలగునవి శక్తివంచన లేకుండఁగ నిచ్చి వరుని నలంకరింపవలెను. మంత్రము నుచ్చరించి దాతపేరు పదిమందికి తెలియునట్లు చెప్పి వస్త్రద్వయము వరున కీయవలెను. అదే వస్త్రములను చదివించుట. అవే మధుపర్కములు. మధుపర్క పూజాసమయమున నిచ్చిన వస్త్రములుగాన ఆవస్త్రములకును మధుపర్కము లను వ్యవహారము గలిగినది.

తర్వాత పెరుగును తేనెయు కలిపి కంచుపాత్రలో నుంచి దానిపైని కొంచెము పెద్దదైన కంచుపాత్ర మూఁతపెట్టి కూర్చలతో పరిగ్రహించి "మధుపర్కో మధుపర్కో మధుపర్కః" అని ముమ్మాఱు "మధుపర్కః" అని యుచ్చరింపవలెను.

ఆమధుపర్కమును మంత్రములతో నభిమంత్రించి వరుఁడు ప్రాశనచేయఁబోవును గాన "అమృతోప స్తరణ మసి" అమృత పదార్థమగు మధుపర్కమునకు నీవు క్రిందిపాత్రవంటిదానవు అని కొంచెము నీరు త్రాగి మధుపర్క ద్రవ్యము ప్రాశింపవలెను.

మధుపర్క ప్రాశనమంత్రము:—

| | |
|---|---|
| "య న్మధునో మధవ్యం పరమ మన్నాద్యం వీర్యమ్, తేనాహం మధునో మధవ్యేన పరమేణా న్నద్యేన వీర్యేణ పరమో న్నాదో మధవ్యో సాని." | మధుసంబంధమైన యీయన్నము భక్షించుట అనఁగా తేనె త్రాగుట వీర్యకరమైనది. ఈ వీర్యముచేత నేనును పరముఁడను అన్నాదుఁడను వీర్యవంతుఁడను అగుదును. |

అని యొకమాఱు మంత్రముతోను రెండుమార్లు మంత్ర రహితముగాను భక్షించి "అమృతాపిధాన మసి" ఓఉదకమా నీవు అమృతపదార్థమునకు పయికప్పువంటిదాన వని కొంచెము జలమును త్రావి, హ స్తప్రక్షాళనము చేసికొని మిగిలినది తన దయకుఁ బాత్రుఁడగువానికియ్యవలెను.

అప్పుడు దాత గోవును (ఇప్పుడు గోస్థానమున దర్భను) వరునికిఁ జూపి "గౌః గౌః" అని చెప్పును.

ప్రకృతయుగమున ఉత్సర్జనపక్షము అవలంబించిరి గాన దానికి విహితమగు మంత్రము వరుఁడు పఠించి మంత్రజపానంత రము "ఓమ్ ఉత్సృజత" గోవును విడిచిపెట్టుఁడు అని గట్టిగాఁ జెప్పవలెను. అప్పుడు కన్యాదాత ఆగోవును విడిచిపెట్టవలయును.

కన్యాదాత వరునితో అన్నము సిద్ధమైనది అని చెప్పగా ఆతఁడు అన్న స్తుతి తెలుపు మంత్రములను పఠించును. దాత పరిచారకులను పిలిచి అన్నము తీసికొనిరం డని చెప్ప వా రన్నము తీసికొనిరాఁగా వరుఁ డది చూచును. (అది వరుఁడు భక్షింపవలసినట్లు విధు లున్నను వరుఁడు భక్షించునాచారము ప్రకృతము లేదు) దీనితో మధుపర్కపూజ పూర్ణమైనది. కన్యాదాత వరుని వస్త్రాదులతో యథార్హముగాఁ బూజింపవలెను.

కొందఱు మధుపర్కపూజ అయినతర్వాత కన్యాదానము చేయుదురు. లోకాచారప్రకారము మంగళాష్టకములు పఠింపవలెను.

"తదేవలగ్నం సుదినం తదేవ తారాబలం చంద్రబలం తదేవ
విద్యాబలం దైవబలం తదేవ లక్ష్మీపతే తేంఘ్రియుగం నమామి.
శ్రీదేవీతనయ శ్శివ స్సుఖకరో మిత్ర శ్శశీ కంపన
స్సర్వే తే మునయో చలాచలదిశ స్సర్పా మృగేంద్రాః ఖగాః
నద్యః పుణ్యసరోవరాణి దితిజా స్తీర్థాని కంజాసన
శ్చేంద్రో వహ్ని యమరా సదా జలధయః కుర్వంతు వాం మంగళమ్."

ఇత్యాది శ్లోకములను పఠింతురు.

సుముహూర్తసమయమున వధూవరులశిరస్సులందు సజీరకగుడము (బెల్లము జీలకఱ్ఱ కలసినముద్ద) పెట్టుదురు. మంగళద్రవ్యములను శిరములందుఁ బెట్టవలయును. మంగళద్రవ్యములలో సర్వసామాన్యముగా లభించునవి బెల్లము, జీలకఱ్ఱ, పసుపును. ఆవికలిపి ముద్దచేసి శిరములపైని ఉంచెదరు. అని

గ్రహింపఁదగియున్నది. దీనికి విధివిధానము దొరకలేదు. ఆచార ప్రాప్తములలో నిది యొకటి

| | |
|---|---|
| "ధ్రువం తే రాజా వరుణో | వరుణుఁడు, బృహస్పతి, ఇంద్రుఁ |
| ధ్రువం దేవో బృహస్పతిః | డు, అగ్ని నీరాష్ట్రమును ధ్రువ |
| ధ్రువం త ఇంద్రశ్చాగ్నిశ్చ | మైనదానినిగాఁ గావింతురు గాక. |
| రాష్ట్రం ధారయతం ధ్రువమ్." | వృత్రాసురుని చంపివచ్చిన యిం |
| .................. | ద్రునివలె స్థిరముగా రాష్ట్రము |
| ఇంద్ర ఇవ వృత్రహా తిష్ఠ. | పాలింపుము. |

నీరాష్ట్రమునకు ధ్రువత్వమును దేవతలు కలిగింతురు గాక యనుట ముఖ్యము.

'అయం ముహూర్త స్సుముహూర్తోఽస్తు' ఈ ముహూర్తము సుముహూర్త మగుఁగాక యని పెద్దలందురు. అట్టి సుముహూర్తమున వరుఁడు కన్యకను చూచి నేత్రములను మరలించి యిట్లు జపించును.

| | |
|---|---|
| "అభ్రాతృఘ్నీం వరుణాపతిఘ్నీం | ఓవరుణ! ఈవధువునకు అభ్రా |
| బృహస్పతే, ఇంద్రాపుత్రఘ్నీం | తృఘ్ని అనఁగా భ్రాతృహింస |
| లక్ష్మ్యం తా మస్యై సవిత | గలుగకుండఁగఁజేయు లక్ష్మిని ఇమ్ము. |
| స్సువ." | ఓబృహస్పతీ! ఈకన్యకు అపతిఘ్ని |
| | అనఁగా పతిహింస గలుగకుండఁగఁ |
| | జేయులక్ష్మి నిమ్ము |

ఇంద్రా! అపుత్రఘ్ని అనఁగా పుత్రమరణము లేకుండఁగఁ జేయు లక్ష్మి నిమ్ము.

ఓసవితా! పై లక్ష్ములనన్నిటిని నీవు ఇమ్ము. భ్రాతృపతిపుత్రమరణములు కలుగకుండఁగఁజేయుము.

## సమీక్షణము.

మరల వరుఁడు కన్యకను సమీక్షింపవలెను. సమీక్షణ మనఁగా (అవయవశః) ప్రత్యవయవము చూచుట. సమీక్షణసమయమున నీమంత్రము పఠించును.

"అఘోరచక్షు రపతి ఘ్న్యేధి శివా పతిభ్య స్సుమనా స్సువర్చాః, జీవసూ ర్దేవకామా స్యోనా శం నోభవ ద్విపదే శం చతుష్పదే."

ఓకన్యకా! నీవు సౌమ్యదృష్టిగలదానవై అపతిఘ్నివి అనఁగా పతిని హింసింపనిదానవు కమ్ము. నాకును నాసోదరులకును సుఖకారకురాలవగుము. మంచి వర్చస్సును మనస్సును గలదానవయి జీవసంతతిని బడయుము. దేవతలను యజింపవలయునని కోరుచుండుము. ప్రశస్తవై మాసంబంధమగు ద్విపాత్తులకును చతుష్పాత్తులకు సుఖకారకురాల వగుము.

తర్వాత నడుమఁ బట్టిన తెర తీసివేయుదురు.

ఇది మొదలు వధూవరు లిద్దఱును కలసి సంకల్పము చేయుదురు. దంపతుల మయిన మనకు ఆయుర్వీర్యోచ్ఛబలాభి వృద్ధ్యర్థమై "ఆవాభ్యాం కర్మాణి కర్తవ్యాని, ప్రజాశ్చోత్పాదయితవ్యాః." మనచేత కర్మ లాచరింపఁబడవలెను, ప్రజలు జనింపఁబడవలయును అని చెప్పుదురు.

"తస్యాభ్రువో రంతరా దర్భేణ సమృజ్య ప్రతీచీనం నిరస్యేత్.

వధువు కనుబొమల మధ్యభాగమును దర్భతో తుడిచి యాదర్భ పశ్చిమముగాఁ బాఱవేయవలెను.

"ఇద మహం యా త్వయి పతిఘ్న్యలక్ష్మీ స్తాం నిర్దిశామి.

కన్యకా! పతిఘ్ని (పతిని హింసించునది) యగు ఏఅలక్ష్మి నీయందుఁ గలదో ఆయలక్ష్మిని ఇదిగో తుడిచి వేయుచున్నాను. ఈదర్భలను పాఱవేయుటయే యాదుర్లక్ష్మిని తుడిచి పాఱవేయుట.

కన్యకగాని కన్యకాబంధువులుగాని ఎడఁబాయుదుమని అనుభయమున ఏడ్చినయెడల ఈక్రింది మంత్రము పఠింపవలెను.

"జీవాగ్ం రుదంతి విమయంతే అధ్వరే దీర్ఘా మను ప్రసితిం దీధియు ర్నరః, వామం పితృభ్యో య ఇదగ్ం సమేరిరే మయః పతిభ్యో జనయః పరిష్వజే."

ఓకన్యాబంధుజనులారా! జీవించియున్న కన్యకనుగుఱించి మీారేడ్చుచున్నారు. హింసారహితమగుకాలమున మీారు సంతోషించుటకు మాఱు ఏడ్చుచున్నారు.

చాల వ్యత్యస్తముగా ప్రవర్తించు
చున్నారు. మా భావబంధము దీర్ఘ
కాలము ఉండునట్లు తలంపుడు.

తల్లిదండ్రులకుఁ గోరఁదగినదియు,
పతినగునాకు సుఖకరమైనదియు,
ఈవధువునకు ఆలింగనసుఖమునకు
సాధనమైనదియు నగు ఈవివాహ
ము మీరే ప్రేరించితిరి గదా. మా
భావబంధమును ఆలోచించి సంతో
షింపుఁడు. మీరు రోదనము చేయ
కుఁడు.

ఈపయిది కన్యకకు మంచి వర్చస్సు గలుగుటకై చేసెడు
సంస్కారము. ఇందే బండికాడి తీసికొనివచ్చి కన్యకనెత్తిమీఁదికి
కాడితోలలు వచ్చునట్లు పెట్టి అతోలలలో బంగారముంచి దాని
మీఁదనుండి జలమును మంత్రముల నుచ్చరించుచు పోసెదరు.
అందలివిషయము లన్నియు క్రమముగాఁ దెలియనగును మంత్ర
వేత్తలగు బ్రాహ్మణులను కన్యకాస్నపనార్థమగు (కన్యకను స్నా
నముచేయించుట కుపయోగించు) జలమునకై పంపుచు నిట్లు
చెప్పవలెను.

"వ్యృష త్ర్కార ముదచం త్వాప బ్రాహ్మణులారా! ఈవధువును
ఆస్యై బ్రాహ్మణా స్స్నపనగ్ం స్నానముచేయించుటకై ఉదకము
హారంతు, అవీరఘ్నీ రదచం ను తీసికొనిరండు.

ఉదకమందున్న క్రూరత్వము పో
వుఁగాక. ఉదకము పైకివచ్చుఁగాక.
అపుత్రఘ్నులు పుత్రహింసచేయ
నివి—పుత్రమరణహేతువులుకాని
—జలములు పయికి వచ్చుఁగాక.

దర్భలతో గుండ్రముగా చుట్టినచుట్టకు ఇణ్వ మని పేరు. అది కన్యకాశిరస్సుపైని పెట్టి యీమంత్రము పఠింపవలెను.

"అర్యమ్ణో అగ్నిం పరియంతు క్షిప్రం ప్రతీక్షం తాగంశ్వ శ్వో(వి) దేవరాశ్చ,

మాతల్లియు, ఈకన్యతల్లియు, నా సోదరులును, ఈ కన్యాసోదరులును (సూర్యానుగ్రహమువలన) ఈక న్యకనెత్తిమీఁద నుంచిన దర్భేణ్వ మును చూచుటకై వీలుగా నుండు నట్లు ఈవివాహాగ్నికి చుట్టును మం డలాకారముగా నిలఁబడుదురు గాక.

బండికాడి.

ఆయిణ్వమునకు సరిగా వచ్చునట్లు బండికాడి కుడివైపు తొలలలో వెలుపటిదానియందుంచి యిట్లు పఠింపవలెను.

"ఖేఽనసః ఖే రథః ఖే యుగస్య శచీపతే, అపాలా మింద్ర త్రిః పూ_ర్త్వ్యకరత్సూర్యవర్చసమ్."

ఓయింద్రా! శచీపతీ! బండియి రుసుతొలనుండియు, రథరంధ్రము నుండియు, కాడిరంధ్రమునుండియు

జలమును మీఁదబోసి అపాల అను
కన్యకను ముమ్మాఱు పవిత్రము
చేసి సూర్యవర్చస్సుగలదానినిజేసి
తివి. అట్లే యీకన్యకను గూడఁ
జేయుము.

ఇచ్చట ఒక కథ తెలిసికొనవలయును. పూర్వము అపాల యను పేరుగల కన్యక యొకతె యుండెను. ఆమెకు శ్విత్ర (బొల్లి) రోగ ముండుటచేత ఆమె నెవరును బెండ్లాడరైరి. ఇంద్రుని గుఱించి యాగముచేయవలయు ననువాంఛ యామెకు కలదు. వివాహముకానిదాని కది సాధ్యము కాదు. కావున మిగుల విచారించుచుండెను. ఒకనాఁ డామె నదిలో స్నానము చేయుచుండఁగాఁ బ్రమాదవశమునఁ బ్రవాహమునఁ బడి కొట్టుకొనిపోవుచుండెను. ఆమెకు ఇంద్రునిగుఱించి యాగము చేయఁజాలనైతి ననువిచారము గలిగెను. అప్పుడు దైవవశమున సోమలత యొకటి యామె నోటిదగ్గఱకుఁ గొట్టికొనివచ్చెను. (యాగమున సోమలతరసమే యింద్రునకు ముఖ్యమైనది.) ఆమె ఆలతను రసమువచ్చునట్లు పళ్లతో నమలి యారసమును ఇంద్రు నుద్దేశించి ఉమ్మివేసెను ఇంద్రుఁడు వచ్చి యారసముగ్రహించి తనరథమునకును ఇరుసునకును కాడికిని గలరంధ్రములనుండి జలమును స్రవింపఁజేసి యామెమీఁదఁ బోసెను. దానివలన ఆమెరోగము పోయెను. ఆమె సూర్యవర్చస్సు గల దయ్యెను.

ఈకథ ఋగ్వేదమునఁ గలదు. ఈసంప్రదాయమును బట్టియు, ముందు మంత్రమున కాడినిమాత్రము చెప్పుటచేతను బండికాడిని తెచ్చి కన్యకనెత్తిమీఁద నున్నయిణ్వాముమీఁదికి వచ్చునట్లు కాడితోల నుంచి పయిమంత్రము పఠించి యింద్రుఁ డీకన్యకను పవిత్రనుచేసి సూర్యవర్చస్సు గలదానిని జేయుఁగాత మని ప్రార్థించుచున్నాఁడు.

యుగచ్ఛిద్రమునందు సువర్ణ ముంచునపు డిది పఠింప వలెను. అందు మంగళసూత్రముల నుంచెదరు.

"శం తే హిరణ్యాగ్ం సముశం త్వా ప శ్శం తే మేథీ భవతు శం యుగస్య తృద్మ, శంత ఆప శ్శత పవిత్రా భవం త్వథాపత్యా త స్వగ్ం సగ్ం సృజస్వ."

ఓకన్యకా ! యుగచ్ఛిద్రమునను ంచినసువర్ణము నీకు శుభప్రద మగుఁగాక. నీమీఁదఁ బడుచున్న నీళ్లును నీకు శుభప్రదము లగుఁగాక ఈ కాడియు, ఈకాడిరంధ్రమును శుభప్రదము లగుఁగాక. శతపవిత్రములు (అనేకులను పవిత్రులనుగా గావించిన) యీనీళ్లు నీకు శుభప్రదము లగుఁగాక. అనంతరము పతినైన నాతో నీశరీరమును గలుపుము.

తర్వాత 'హిరణ్యవర్ణా' మొదలగు స్నానమంత్రములతో స్నానము చేయించవలెను.

## కన్యకకు దీక్షావస్త్రము.

అనంతరము అహతమగు వస్త్రమును కన్యకకు కప్పవల యును. అహతమనఁగా తడపనిది, ధరింపనిది, అంచులుగలది ...యగు వస్త్రము.

"పరిత్వా గిర్వణో గిర ఇమా భవంతు విశ్వతః, వృద్ధాయు మనువృద్ధయో జుష్టా భవంతు జుష్టయః."

ఓ ఇంద్రా! నీవు స్తుతిలక్షణమైన వాక్కులతో సేవింపఁదగినవాఁడవు. ఈవస్త్రము ఈకన్యకను క్రమ్మునట్లు మాస్తుతులు నిన్నుఁ గ్రమ్ముఁగాక. నీవు వృద్ధాయుఁడవు. అనఁగా పెద్ద లనుగుఱించి పోవువాఁడవు. పెద్ద లను సేవించువాఁడవు. నావాక్కు లు అనువృద్ధులు అనఁగా ప్రవృద్ధ ములు. సేవితవ్యములగు నావా క్కులు నీచే సేవింపఁబడుఁగాక.

ఈమంత్రముతోఁ గన్యకకు వస్త్రమును కప్పుదురు. మధు పర్కపుచీర అని దీనిని కొందఱు వాడెదరు. ఈచీర దీక్షావస్త్ర ముగా ధరింపఁజేయుదురు.

## మంగళసూత్రధారణము.

మాంగళ్యతంతువును, యోక్త్రమును పూజించి తర్వాత మంగళసూత్రధారణమును, యోక్త్రబంధనమును చేయుదురు.

| | |
|---|---|
| "మాంగళ్యతంతు నా నేన మమ జీవనహేతునా, కంఠే బధ్నామి సుభగే త్వం జీవ శరదాం శతమ్. | ఓ సౌభాగ్యవతీ! నాజీవనమునకు హేతువైన యీమాంగళ్యతంతువును నీకంఠమునఁ గట్టుచున్నాను. నీవు నూఱుసంవత్సరములును జీవింతువు గాక. |

## యోక్త్రబంధనము.

యోక్త్ర మనఁగా దర్భలతో పేనిన నడికట్టు. ఇది కర్మాధికారమునకు సూచకము.

| | |
|---|---|
| "ఆశాసానా సౌమనసం ప్రజాగ్ం సౌభాగ్యం తనూమ్, అగ్నే రనువ్రతా భూత్వా సన్నహ్యే సుకృతాయ కమ్." | ఈవధువు సౌమనస్యమును(మంచి మనస్సుగలుగుటను) సంతతిని, సౌభాగ్యమును కోరుచున్నదై అగ్ని పరిచర్యచేయుట కనుకూలురాలై నిలఁబడియున్నది. వివాహామనెడి యీపవిత్రకర్మనిమిత్తము ఈయోక్త్రమును సుఖముగా నుండునట్లు కట్టుచున్నాను. |

## తలంబ్రాలు.

తర్వాత ఆర్ద్రాక్షతారోపణము, తలంబ్రాలు పోయుట. తలమీఁద పోయుబియ్యమునకు తలంబ్రా లని పేరు వచ్చినది. 'కపిలావచనాదిమంగళాచారప్రాప్తం కుర్యాత్' అని విధిని చేర్చుకొనిరి. దీనికి ఆపస్తంబసూత్రమున మూలము లేదు. దీని ప్రయోగ మిట్లున్నది.

వరుఁడు వధువుదోసిటిలో పాలచుక్కలువేసి కడిగి యాఱిఁ బెట్టిన బియ్యము కొంచెము కొంచెము రెండుమార్లువేసి మరల పాలచుక్కలు వేయును. అట్లే వరుని దోసిటిలో మరొకరు బియ్యము పోసెదరు. ఉదకసహితమగు కలశము (బిందె) తీసికొని వచ్చి బ్రాహ్మణులతోఁ గూడ

| | |
|---|---|
| కపిలాగ్ం స్మారయంతు దక్షిణాః పాంతు బహుదేయం చాస్తు పుణ్యం వర్ధతామ్ శాంతిరస్తు పుష్టిరస్తు తుష్టిరస్తు.... | కపిలను స్మరింతురు గాక. దానమియ్యఁదగిన పదార్థము సమృద్ధిగా నుండుఁగాక. పుణ్యము వృద్ధియగుఁ గాక. శాంతి కలుగుఁ గాక. పుష్టి కలుగుఁ గాక. తుష్టికలుగుఁ గాక. |

ఇత్యాదిమంత్రములు పఠింతురు. ఇందు ముఖ్యమైనవి కొన్ని చేర్పఁబడును.

| | |
|---|---|
| "యథా హ మస్యా అతృపఙ్ స్త్రియై పుమాన్, యథా స్త్రీ తృప్యతి పుగ్ంసి ప్రియే ప్రియా, ఏవం భగస్య తృప్యాణి, | నేను ఈస్త్రీయందు తృప్తిగల వాఁడనగునట్లును, ఈ స్త్రీ నాయందు తృప్తిగలది యగునట్లును దేవతలు కావలసిన శక్తులను అనుగ్రహింతురు గాక. |
| పశవో మే కామ స్సమృద్ధ్యతామ్, యజ్ఞో మే కామ స్సమృద్ధ్యతామ్. | నాకు పశుసమృద్ధి, యజ్ఞసమృద్ధియుఁ గలుగుఁగాక. కామసమృద్ధి గలుగుఁగాక. |

అని చెప్పి వరుఁడు వధువుతలపైని, వధువు వరునితలపైని తలంబ్రాలు పోయుదురు. తర్వాత పెద్దలయాశీర్వచనము.

## బ్రహ్మగ్రంథి.

బ్రహ్మఅనఁగా పురోహితుఁడు దంపతుల బట్టలకొంగు లను ముళ్లు వేయును. హోమసమయమున దంపతులు విడి యుండఁగూడదుగాన దూరముగాఁ బోకుండఁగ వేసెడి ముళ్లు.

## ప్రధానహోమము.

వరుఁడు వధువుకుడిచేయి పట్టుకొని అగ్నిసమీపమునకుఁ దీసికొనివచ్చుచు, నిట్లు చెప్పును:—

"పూషా త్వేతో నయతు హస్త గృహ్యాశ్వినా త్వా ప్రవహ తాగ్ం రథేన, గృహాన్ గచ్ఛ గృహపత్నీ యథా సో వశినీ త్వం విదథ మావదాసి."

ఓకన్యకా! ఆదిత్యుఁడు నీచేతులు పట్టుకొని యిక్కడనుండి అగ్ని సన్నిధికి తీసికొనివచ్చుఁగాక. హో మాదికము పూర్తిచేసి బండిమీఁద మాయింటికి తీసికొనిపోయెదను. అశ్వినీదేవతలు అనుమతి యిత్తురు గాక. నీవు నాయింటికి ఆధిపత్యము వహించుటకు రమ్ము. మాయింటికి స్వామ్యమును పొంది యజ్ఞాదివిష యములను గుఱించి ఆభిముఖ్య ముతో చెప్పుము.

అగ్నియందు హోమముచేయుటకు కావలసిన సామగ్రి సిద్ధపఱచి కన్యకతో నిట్లభిమంత్రించును:—

"సోమః ప్రథమో వివిదే గంధ
ర్వో వివిధ ఉత్తరః, తృతీయో
అగ్నిష్టేపతి స్తురీయ స్తే మనుష్య
జాః."
సోమో దద ద్గంధర్వాయ గంధ
ర్వో దద దగ్నయే,
రయించ పుత్రాగ్ శ్చాదా దగ్నిర్మ
హ్యా మథో ఇమామ్."

కన్యకపుట్టగానే సోముఁడు కొంత
కాలమును గంధర్వుఁడు కొంత
కాలమును అగ్ని కొంత కాలమును
కన్యకను కాపాడుచుందురు. కావున
కన్యకకు వారు పతులుగా భావింపఁ
బడిరి. వారిని హోమప్రార్థనాదుల
వలన సంతృప్తుల గావించి వారి
వలన తాను కన్యకను బొంది మను
ష్యుఁడు పతి యగును. కావుననే
యీమంత్రములందు ఇట్లు చెప్పఁ
బడెను.

సోముఁడు మొదట నిన్నుఁ బొం
దెను. అతఁడు ప్రథమపతి. గంధ
ర్వుఁడు ద్వితీయుఁడు నిన్నుఁ బొం
దెను. అగ్ని మూఁడవవాఁడై నిన్నుఁ
బడసెను. మనుష్యుఁడనైన నేను
నాల్గవవాఁడను.

సోముఁడు నిన్ను గంధర్వునకు
ఇచ్చెను. గంధర్వుఁడు అగ్నికిచ్చె
ను. అగ్ని నిన్ను, ధనమును పుత్త్రు
లను నాకు ఇచ్చుఁగాక.

## పాణిగ్రహణము.

అని యభిమంత్రించి కన్యకయొక్క కుడిచేయి పట్టుకొనును. ఇదే పాణిగ్రహణము. పాణిగ్రహణమంత్రములు నాలుగు.

"గృహ్ణామి తే సుప్రజాస్త్వాయ హస్తం మయా పత్యా జరదష్టి ర్యథాసః, భగో అర్యమా సవితా పురంధి ర్మహ్యం త్వాఽదు ర్గార్హపత్యాయ దేవాః."

ఓ కన్యకా! నీ హస్తమును పట్టుకొనుచున్నాను. ఎందులకంటే మంచి సంతతిని పొందుటకు. బహుప్రజ్ఞులగు భగుఁడు, అర్యముఁడు, సవిత, అను దేవతలు గృహస్థధర్మములు నడిపించుటకై నిన్ను నాకు ఇచ్చిరి. నాతోఁ గలసియుండి నాతో సమముగా జరదవస్థను పొందినదానవగుము. అనఁగా వార్ధకము వచ్చువరకుఁగూడ విడిపోవక కలసియుందము.

"తేహ పూర్వే జనాసో యత్ర పూర్వవహో హితాః, మూర్ధన్వాన్ యత్ర సౌభ్రవః పూర్వో దేవేభ్య ఆతపత్."

ఆభగాదిదేవతలు ఆదికాలమున వివాహము చేసికొని గృహస్థధర్మములు నడిపినవారు. ఆదేవతలలో (సౌభ్రవుఁడు) అగ్ని మొట్టమొదటివాఁడు. వారు నడిపించిన గృహస్థధర్మములు నడుపుటకై నిన్ను

నాకు ఇచ్చిరి కావున నీహస్తమును నేను పట్టుకొనుచున్నాను.

"సరస్వతి ప్రేద మవ సుభగే వాజి నీవతి, తాం త్వా విశ్వస్య భూతస్య ప్రగాయామ స్య గ్రతః."

ఓసరస్వతీ! నీవు ఈపాణిగ్రహణ మును రక్షింపుము. అన్నసమృద్ధి (లేక స్తోత్రప్రియత) గలదానవు. నిన్ను మేము ప్రపంచము ముందర స్తుతింతుము.

"య ఏతి ప్రదిశ స్సర్వా దిశోమ పవమానః,హిరణ్యహస్త ఐరమ్మ స్స త్వా మన్మనసం కృణోతు."

భక్తుల కిచ్చుటకై బంగారమును చేతులలోఁ బెట్టుకొని సర్వదిక్కులును సంచరించువాఁడును అగ్నికి మిత్రుఁడును అగువాయువు నిన్ను నాయందు మనస్సుగలదానినిగాఁ గావించుఁగాక.

## సప్తపది

ఈపైది సప్తపది. సప్తపది యనఁగా వరుఁడు కన్యకను ఏడడుగులు నడిపించుచు తనకోరికలు ఏడు వాక్యములతోఁ దెలుపును. తర్వాత కన్యకతో తనసఖ్యము తెలిపి యామె సఖ్యమును తాను సంపాదించును. జన్మాంతమే కాక జన్మజన్మాంతరముల వఱకు నుండవలసిన సఖ్యమును కుదుర్చుకొనిన యీసప్తపది నను సరించియే సఖ్యమునకుఁ బర్యాయముగా సాప్తపదీనము అనుపద మేర్పడినది. ఇందు గృహస్థునకుఁ గావలసిన విషయములును

దంపతులసఖ్యము, వారిముఖ్యోద్దేశములును సంగ్రహింపఁబడినవి. ఈసప్తపది పూర్తిగానియెడల వివాహము పూర్తి కాఁజాలదు. ఇది వివాహసిద్ధికి పరమావధి

అథ ఉత్తరే ణాగ్నిం దక్షిణేన పదా ప్రాచీ ముదచీం వా దిశ మభిప్రక్రమయతి ఏకమిష ఇతి ప్రతిమంత్రగ్ం సప్త పదాని గత్వా.

అగ్నికి ఉత్తరవైపున కుడికాలు మొదట పెట్టుచుప్రాగ్దిక్కుగాఁగాని ఉత్తర దిక్కుగాఁగాని కన్యకను వరుఁడు నడిపించును. ఏడడుగులు వేయునపుడు క్రమముగా ఏడు మంత్రములు చెప్పవలయును.

ఏకమిషే విష్ణుస్త్వా న్వేతు.

మొదటిపదము నీకు అన్న సమృద్ధి గలుగుటకై (నడిపింతును) విష్ణువు నిన్ను అనుసరించుఁగాక.

ద్వే ఊర్జే విష్ణుస్త్వా న్వేతు.

రెండవపదము బలము కలుగుటకై ...

త్రీణి వ్రతాయ విష్ణుస్త్వా న్వేతు.

మూడవపదము (వ్రతము) కర్మ సమృద్ధి గలుగుటకై....

చత్వారి మాయో భవాయ విష్ణుస్త్వా న్వేతు.

నాల్గవపదము సుఖము గలుగుటకై....

పంచ పశుభ్యో విష్ణుస్త్వా న్వేతు.

అయిదవపదము పశుసమృద్ధి గలుగుటకై....

షడృతుభ్యో విష్ణుస్త్వా న్వేతు

ఆఱవపదము ఋతువులు అనుకూలము లగుటకై...

సప్తసప్తభ్యో హోత్రాభ్యో విష్ణు
స్త్వా న్వేతు.

ఏడవపదము సప్తహోత్రలు. (హోతా ప్రశాస్తా బ్రహ్మణాచ్ఛంసీ పోతా నేష్టాచ్ఛావాకఆగ్నీధ్ర ఇతి సప్తహోత్రాః) సోమయాగమునను వీరు తప్పకయుండవలెనుగాన యజ్ఞము చేయించుటకు ముఖ్యులగు ఋత్విక్కులు లభించుటకై (నడిపింతును.) విష్ణువు నిన్ను అనుసరించుఁగాక.

“సఖా సప్తపదా భవ సఖాయౌ
సప్తపదా బభూవ సఖ్యం తే
గమేయగ్ం సఖ్యాత్తే మా
యోషగ్ం సఖ్యాన్మే మాయో
ష్ఠాః, సమయావ సంకల్పావ
హై సంప్రియౌ రోచిష్ణూ
సుమనస్యమానౌ, ఇష మూర్జ
మభిసంవసానౌ సంనౌ మనాం
గ్ంసి సముచిత్తా న్యాకరం, సా
త్వ మ స్యమూ హ మస్మి సా
త్వం ద్యౌ రహం పృథివీ త్వగ్ం
రేతో హగ్ం రేతో భృత్త్వం
మనో హ మస్మి వా క్త్వగ్ం

నాతో ఏడడుగులు నడచిన నీవు నాకు సఖివి కమ్ము ఏడడుగులు నడచిన మనము సఖుల మైతిమి. నీసఖ్యమును నేను పొందితిని. నీస్నేహమునుండి నేను విడిపోవను. నీవు నాస్నేహమునుండి విడిపోవవలదు. మనమిద్దఱమును కలసికొంటిమి. ఇది యిట్లు చేయవలయునని ప్రతికార్యమందును కలసి సంకల్పింతము. పరస్పరము ప్రీతికలవారమై పరస్పరాశ్రయమువలనఁ బ్రకాశించువారమై మంచిమనస్సు కలవారమై అన్నమును బలమును కలసి యను

సా మా మమువ్ర తా భవ పుగ్ం సే పుత్రాయ వే త్తవ ఏహి సూ నృ తే.

భవింపఁగలవారమై కలసికొంటిమి. మనమనస్సులను బాగుగాఁ గలసిన వానినిగాఁ జేయుదును. ఏధర్మ మాచరించినను కలసియే యాచరింప వలె నని మనమనస్సులును బా హ్యేంద్రియమును బాగుగా కలి యునట్లు చేయుదును నీవు ఋగ్వే దమువంటిదానవు. నేను సామ వేదమువంటివాఁడను. (ఋక్కును సామమును పరస్పరము సంబం ధము గలిగియున్నట్లు మనమును పరస్పరసంబంధము కలవారము.) నీవు పృథివి. నేను ఆకాశము. నేను రేతస్సు. నీవు రేతస్సును భరించుదానవు. నేను మనస్సు. నీవు వాక్కు. నేను సామ. నీవు ఋక్కు. పైవానికి గల ఆను కూల్యము మనకును గలుగుఁగాక. పురుషుఁడగుపుత్త్రునిపొందుటకును, ఐశ్వర్యమును పుత్త్రుని బడయుట కును ఓ ప్రియసంభాషిణీ! నాతోఁ గూడ రమ్ము.

## ప్రధానాహుతులు.

తర్వాత దంపతు లగ్నికిఁ బ్రదక్షిణముచేసి పదునాలు ఆజ్యాహుతులు హోమము చేయవలయును. అందు కొన్నిటిని గ్రహింతము.

"సోమాయ జనివిదే స్వాహా." — వధువును మొదటఁబొందినసోము నకు ఈహవిస్సు దత్తమగుఁగాక.

"గంధర్వాయ జనివిదే." — ఇట్లే గంధర్వునకు

అగ్నయే జనివిదే. — ఇట్లే అగ్నికిని.

"కన్యలాపితృభ్యో యతీ పతి లోక మవ దీక్షా మదాస్థ." — ఈకన్యక పితృకులమునుండి పతికులమునకుఁ బోవుచున్నదై కన్యకాదీక్షను విడిచినది.

"ప్రేతో ముంచాతి నాముత స్సుబద్ధా మము తస్కరత్, యథేం ద్ర మీఢ్వ స్సుపుత్రా సుభగా సతి" — ఓయింద్రా! వర్షదాతా! ఈవధువును పితృకులమును విడుచునట్లు చేయుము. పతికులమునుండి విడుచునట్లు చేయవలదు. అంతేకాక పతికులమునందు సుబద్ధురాలుగా నుండునట్లు చేయుము. పతికులమున అనుబంధము గలదై సుపుత్రయు సౌభాగ్యవతియు నగుఁగాక.

"ఇమాం త్వ మింద్ర మీఢ్వ స్సుపుత్రాగ్ం సుభగాం కృణు, దశా — ఓయింద్రా! వర్షాధారా! ఈ వధువును సుపుత్రవతిగాను సౌభా

స్యాం పుత్రా నాదేహి పతి మే దశం కృధి."

గ్యవతిగాను జేయుము. ఈమెకు పదిమంది పుత్త్రులు గలుగునట్లు చేయుము. పతి నైననన్ను పదునో కండవ వానినిగాఁ గావింపుము.

"అగ్నిరైతు ప్రథమో దేవతా నాగ్ం సో స్యై ప్రజాం ముం చతు మృత్యుపాశాత్, తద యగ్ం రాజా వరుణో నుమన్య తాం యథేయం స్త్రీ పౌత్ర మఘం న రోదాత్."

దేవతలలోఁ బ్రథముఁడైన యగ్ని వచ్చుఁగాక. వచ్చి ఆతఁడే వధువు సంతతిని మృత్యుపాశమునుండి విడి పించుఁగాక. అట్లు చేసెడియగ్నిని వరుణుఁడు అనుమతించుఁగాక. అట్లు చేయుటవలన పుత్త్రనిమిత్తదుఃఖ మీవధువునకు తటస్థింపకుండుఁ గాక. తన్నిమిత్తరోదనము లేక పోవుఁగాక.

"ఇమా మగ్ని స్త్రాయతాం గార్హ పత్యః ప్రజా మస్యై నయతు దీర్ఘ మాయుః, అశూన్యోపస్థా జీవతా మస్తు మాతా పౌత్ర మానంద మభిప్ర బుధ్యతా మి యమ్."

గార్హపత్యాగ్ని (వైవాహికాగ్ని) ఈవధువును రక్షించుఁగాక. కేవలము ఈవధువునే కాక ఈమె సంతతిని దీర్ఘాయుస్సును పొందించుఁగాక. బహుపుత్త్రులకు మాతయై పుత్త్రులచే నలంకరింపఁబడిన ప్రాంతభాగముగలది యగుఁగాక. ఈవధువు నిద్రనుండి మేలుకువ చెందునప్పటికి చుట్టును ఆనందము

గా నాడుకొనుచు నున్న పుత్త్రులను జూచి ఆనందమును బొందుఁగాక.

"మా తే గృహే నిశి ఘోష ఉత్థా దన్యత్ర త్వ ద్రుదత్య స్సం విశంతు, మా త్వం వికే శ్యుర ఆవధిష్ఠా జీవపత్నీ పతిలోకే విరాజ పశ్యంతీ ప్రజాగ్ం సు మనస్యమానామ్."

ఓవధూ! నీగృహమందు రాత్రి ఆర్తధ్వని ప్రాదుర్భవింపకుండుఁగాక. రోదనముచేయుస్త్రీలు నీస్థలముకంటె వేఱేస్థలమున నుందురుగాక. వికీర్ణకేశివై (జుట్టు విరియఁబోసికొని) గుండెలు బాదుకొనవలసిన కారణము నీకు సంభవింపకపోవుఁగాక. జీవపత్నివై పతిగృహమున మంచిమనస్సుగల సంతతిని జూచుచు ప్రకాశించుచుండుము. నీకు రోదననిమిత్తమైన పతివియోగముగాని పుత్త్రవియోగముగాని లేకపోవుఁగాక.

ఈరీతిగా గృహస్థులకుఁ గావలసిన సుఖమును సంతతియును గోరుచు దేవతల నుద్దేశించిన ప్రార్థనలతో హోమములను వరుఁడు చేయును. కన్యకాత్వమున ఆధిపత్యము వహించిన సోమాదిదేవతల యనుమతిని కన్యావ్రతము విడిపించి గేస్తురాలను గావించి అప్పుడు కావలసిన కోరికలను కోరుకొనుట యీ మంత్రములందుఁ గనఁబడుచున్నది. కావుననే ఈహోమములను ప్రధానాజ్యాహుతు లనిరి. అదే ప్రధానహోమ మని ప్రసిద్ధి వడసినది.

## లాజహోమము.

దీనితర్వాత లాజహోమము. అనఁగా పేలాలను హోమము చేయుట.

దీనికిముందు 'దక్షిణేన పదాశ్మానమాస్థాపతి' కన్యకకుడి కాలితో సన్నికంటిపైని త్రొక్కించును. త్రొక్కించు నపుడు చెప్పవలసిన మంత్రము.

"అతి ష్ఠేమ మశ్మాన మశ్మేవ త్వగ్గ్ స్థిరా భవ, అభితిష్ఠ పృతన్యత స్సహస్వ పృతనాయతః."

ఓవధూ! నీ వీరాతిపై త్రొక్కుము. ఈరాతివలెనే నీవు స్థిరమైన దాన వగుము. యోద్ధుకాములను (కజ్జాకువచ్చు వారలను) ఎదిరించి తఱిమి వేయుము. నీవిరోధులను పరిభవింపుము.

అని స్థిరత్వమును కోరి వధువుదోసిటిలో నేతితో నభిఘరించి రెండుమార్లు కొంచెము లాజలు పోసి తిరిగి నేతితో నభిఘరింప కన్యక హోమము చేయును. వధూసోదరు లీలాజ హోమము చేయవలె నని కొంద అందురు.

ప్రథమలాజహోమః—

"ఇయం నార్యుపబ్రూతే కుల్పా న్యావపంతికా, దీర్ఘాయు రస్తు మే పతిర్జీవాతు శరద శ్శతమ్."

ఈకన్యక లాజలను హోమము చేయుచు నాపతి దీర్ఘాయువై నూఱుసంవత్సరములు జీవించుఁగాక యని కోరుచున్నది.

అట్లు హోమము చేసి యగ్నికిఁ బ్రదక్షిణముచేసి మొదటి వలెనే సన్నికంటిపైని త్రొక్కించును. వెనుకటివలెనే స్థిరత్వము మొదలగునవి కోరును.

ద్వితీయలాజహోమః.—

"అర్యమణం ను దేవం కన్యా అగ్ని మయక్షత,స ఇమాం దేవో అధ్వరః ప్రేతో ముంచాతి నా ము త స్సు బద్ధా మము తస్కరత్"

అర్యముఁడను ప్రసిద్ధినొందిన అగ్నిని గుఱించి కన్యకలు పూర్వము యజనము గావించిరి. దానివలన వారు పతులను బొందిరి. ఆయర్యముఁ డీలాజలచేత యజింపఁబడినవాఁడై ఎవరిచేతను హింసింపఁబడనివాఁడయి ఈవధువును పితృకులమునుండి విడిపించుఁగాక పతికులమునుండి విడవకుండఁజేయుఁగాక. అంతే కాక పతిగృహము నందు సుబద్ధురాలగునట్లు చేయుఁగాక.

తృతీయలాజహోమః.—

"త్వ మర్యమా భవసి యత్కనీనాం నామ స్వధావ త్స్వర్యం బిభర్షి, అంజంతి వృక్షగ్ం సుధితం న గోభి ర్య ద్దంపతీ సమనసా కృణోషి."

ఓ అగ్నీ, నీవు అర్యముఁడవు అనఁగా దాతవు. ఏలయనః కన్యకలును, అన్నమును, స్వర్గమును నీయధీనములు. నీదయవలన పురుషులు వానిని పొందుదురు. బాగుగాఁ బాఁతిన వృక్షమునకు నీరు పోసినట్లు గోవికారమైన యాజ్యా

దిద్రవ్యములు నీయందు (హోమ
ముచేసెదరు) పోయుదురు. నీవే
దంపతులను సమానమనస్సుగలవా
రినిగాఁ గావింతువు

మూఁడు లాజహోమములందును ముమ్మాఱు ప్రదక్షిణ
ములు చేయుట కలదు. ఆ ప్రదక్షిణసమయమునఁ జెప్పుమంత్ర
ములలోఁ గూడ దంపతులకోరికలు దెలుపఁబడును.

"తుభ్య మగ్రే పర్యవహన్ త్సూ
ర్యాం వహతునా సహ, పునః
పతిభ్యో జాయాం దా అగ్నే
ప్రజయా సహ, పునః పత్నీ మ
గ్ని రదాదాయుషా సహ వర్చ
సా, దీర్ఘాయుః రస్యా యః పతి
స్స ఏతు శరదశ్శతమ్. విశ్వా
ఉత త్వయా వయం ధారా
ఉదన్యా ఇవ, అతిగాహేమహి
ద్విషః."

ఓ అగ్ని, ఆదికాలమున సూర్య
అనెడి కన్యకను (సవితృపుత్త్రిక)
వహతువు (కన్యకుతండ్రి యిచ్చిన
ద్రవ్యము స్త్రీధనము)తోఁ గూడ
నీకు ఇచ్చిరి. ఇప్పుడు నావంటి పతు
లకు జాయను ప్రజాసహితముగ
నీవు ఇమ్ము. అగ్ని ఆయుస్సుతోను
వర్చస్సుతోను పత్నిని నాకు నేఁ
డిచ్చుఁగాక. ఈమెపతి దీర్ఘాయు
వగుఁగాక. నూఱుసంవత్సరము
లును జీవించుఁగాక. అగ్నీ! వృష
భాదులు వర్షధారలను దాఁటు
నట్లు మేము నీచేత సనాథుల మయి
శత్రువులను అతిక్రమించెదము.

ఇక్కడకు హోమములు పూర్తి యైనవిగాన వివాహ కర్మాంగముగా కన్యకకు కట్టిన యోక్త్రమును వరుఁడు విప్పును.

## యోక్త్రవిమోచనము.

"ప్రత్వాముంచామి వరుణస్య పాశా ద్యేన త్వాఽబధ్నా త్స విత స్సుకేతః, ధాతుశ్చ యోనౌ సుకృతస్య లోకే స్యోనం తే సహ పత్యా కరోమి."

సవిత యేపాశముతో నిన్ను కట్టెనో ఆపాశమును నేను విప్పు చున్నాను. ఈపాశమును విమోచనముచేయుటయే నిన్ను వరుణ పాశమునుండి విడిపించుట.

పుణ్యలోకమగు బ్రహ్మలోకమునఁ బతినైన నాతో నీకు సుఖస్థానమును కల్పింతును.

"ఇమం విష్యామి వరుణస్య పాశం య మబధ్నీత సవితా సుశేవః, ధాతుశ్చ యోనౌ సుకృత స్య లోకే రిష్టాం త్వా సహ పత్యా కృణోమి."

ఓవధూ! భక్తులకు సుఖకరుఁ డైన సవిత యేపాశమును నీకు కట్టెనో ఆపాశమును విప్పుచున్నా ను. యోక్త్రవిమోచనమే వరుణ పాశవిమోచనము. పుణ్యలోక మైన బ్రహ్మలోకమున పతినైన నాతో కూడ నిన్ను శాశ్వతముగా నుండునట్లు చేయుదును.

## ప్రవేశహోమము.

వరుఁడు వధువును తీసికొని తన యింటికిఁ బోయి అచ్చట ప్రవేశించినపుడు చేసెడి హోమము. గృహ్యాగ్నిని తమతోఁ

దీసికొనిపోవలయును. కాలానుసారముగా కన్యాదాతయింటనే ఆప్రవేశహోమము కూడఁ బూర్తిచేయుచున్నారు. వరుఁడు కన్యాదాతవలన సోమగంధర్వాగ్నులవలనను కన్యకను సంపాదించుకొని అగ్నిసన్నిధిని సఖ్యము కుదుర్చుకొని కన్యకావ్రత పరిసమాప్తిని తెలుపుమంత్రములతో ప్రధానలాజహోమములు పూర్తిచేసికొని తనపత్నియగు వధువును తనయింటికిఁ దీసికొని పోవును.

## ప్రయాణము.

పోవునపుడు ప్రయాణసాధనములలో ముఖ్యము బండి గాన ఆబండిమీఁదఁ దీసికొనుపోవును. దానివిధానము చూతము.

"సత్యే నోత్తభితా భూమి స్సూర్యే ణోత్తభితా ద్యౌః, ఋతే నాదిత్యా స్తిష్ఠంతి దివి సోమో అధిశ్రితః."

ఓరథమా! ఏరీతిగా ఈభూమి త్రికరణ (మనోవాక్కాయ) శుద్ధమగు సత్యముచేత నిలఁబెట్టఁబడి నిలిచినదో, ఏరీతిగా సూర్యునిచేత ఆకాశమునిలఁబెట్టఁబడి నిలిచినదో, యజ్ఞముచేత ఆదిత్యులెట్లు నిలఁబడిరో, ఆకాశమున చంద్రుఁ డెట్లుండెనో, అట్లే మాచేత నిలఁబెట్ట బడిన నీవు నిలిచియుండుము.

"వాహౌ వుత్తరాభ్యాం యునక్తి."

ఈక్రింది రెండు మంత్రముల తోను బండి ఎడ్లను బూన్చును.

"యంజంతి బ్రధ్న మరుషం
చరంతం పరి తస్థుషః రోచంతే
రోచనా దివి."

వడిగా బరువెత్తఁగలదియు, స్థావరమగు చెట్లు మొదలగువానిని తప్పించుకొని పోవునదియు నగు పెద్దగుఱ్ఱమునుగాని ఎద్దునుగాని ఆకాశమున నక్షత్రములు ప్రకాశించునంతవఱకు ఇటువంటి కర్మల యందుమనుష్యులు బండికి కట్టెదరు.

"యోగే యోగే తవస్తరం వాజే
వాజే హవామహే, సఖాయ
ఇంద్ర మూతయే."

ఎప్పుడెప్పుడు రథాదులకు గుఱ్ఱములనుగాని, ఎడ్లనుగాని కట్టవలసి వచ్చునో అప్పుడప్పుడును, యుద్ధములు ప్రాప్తమైనపుడును మాపరిపాలనముకొఱకు వృద్ధియుక్తుఁడగు నింద్రుని మిత్రులమై పిలుతుము.

బండిమీఁద నెక్కుచున్న వధువును వరుఁడు అభిమంత్రించును.

"సుకిగ్ంశుకగ్ం శల్మలిం విశ్వ
రూపగ్ం హిరణ్యవర్ణగ్ం సు
వృతగ్ం సుచక్రమ్, ఆరోహ
వధ్వమృతస్య లోకగ్గ్ స్యోనం
పత్యే వహతుం కృణుష్వ."

వధూ! ఈరథము మంచిమోదుఁగు, బూరుగువృక్షములకొయ్యలతోఁ జేసినదియు, నానారూపములు గలదియు, ప్రకాశమైన కాంతిగలదియు, మంచినడకగలదియు, మంచి చక్రములు గలదియు నయియున్నది. దీర్ఘాయువు గలనాకు స్థానమగు

సీరథ మెక్కుము. ఎక్కి నాకు సౌఖ్యకరమును నీతండ్రి యిచ్చిన దియునగు స్త్రీధనమును (వరాతు వును) బండిమీఁదఁ బెట్టుము.

## వధువునకు సర్వాధిపత్యము.

"ఉదు త్తర మారోహంతీ వ్యస్యంతీ పృతన్యతః, మూర్ధానం పత్యు రారోహ ప్రజయా చ విరా డ్భవ."

శ్రేష్ఠమైన యీబండిపైని ఎక్కి విరోధులనుతఱిమి వేసినదానవై పతినైన నాశిరస్సుపై నెక్కుము అనఁగా ప్రధానురాలవగుము ప్రధానురాల వయి ప్రజచేత విరాట్టవగుము (పదిమంది కుమారులను బడయుము.)

"సమ్రాజ్ఞీ శ్వశురే భవ సమ్రాజ్ఞీ శ్వశ్ర్వాం భవ, ననాందరి సంరాజ్ఞీ భవ సంరాజ్ఞీ అధిదేవృషు."

అత్తమామలపై సంరాజ్ఞివగుము. పతిసోదరి (ఆడుబిడ్డ)పై సంరాజ్ఞివి కమ్ము. అట్లే పతిసోదరులపై బావలపైని మఱఁదులపైని సామ్రాజ్యము వహింపుము.

స్నుషాణాగ్ శ్వశురాణాం ప్రజాయాశ్చ ధనస్య చ, పతీనాం చ దేవృాణాం చ సంజాతానాం విరా డ్భవ."

(పై భావమును తిరిగి జెప్పుచు) మాయింటిలో కోడళ్లపయిని, అత్తమామలపైని, నాసోదరులపైని, కలుగఁబోవు నీసంతతిపయిని, నాధనము

పయిని, నాసోదరులపైని విరాట్టవగుము. (ఆధిపత్యము గలదానవగుము)

'గృహాను త్తరయాసంకాశయతి.' ఈముందు మంత్రముతో తన గృహములను చూపును.

"సంకాశయామి వహతుం బ్రహ్మణా గృహై రఘోరేణ చక్షుషా మైత్రేణ, పర్యాణద్ధం విశ్వరూపం యదస్యాగ్స్యోనం పతిభ్య స్సవితా కృణోతు తత్."

ఓవధూ! నీకు మీతండ్రి యిచ్చిన ద్రవ్యములను (పెట్టుకొనుటకు స్థానమయిన) మాయింటిని మంత్రోచ్చారణ పూర్వకముగా చూపించుచున్నాను. (వధువు తన తండ్రియిచ్చిన ద్రవ్యమును ముందు ఇంటిలోనికి పంపి తర్వాత తాను ప్రవేశింపవలెనని వ్యాఖ్యాతలు వ్రాసిరి.) సౌమ్యమును మైత్రిగలదియు నగు కంటితో చూడుము. నీకు నీబంధువులు పెట్టిన నానావిధమయిన అలంకారాదికమంతయు నాకును నాసోదరాదులకును సంతోషకరమైనదిగా నుండునట్లు సవిత చేయుగాక.

మంత్రపఠనముతో బండియెడ్లను విప్పి తాను ఇంటిలో ఎఱ్ఱనివృషభచర్మమును లోమములు పైకి వచ్చునట్లు తూర్పుగా దానితల యుండునట్లును పఱచి యిట్లు జపించును.

శర్మవర్మేదమాహరాస్యై నా ద్యా ఉపస్తిరే, సినీవాలి ప్రజాయతామియం భగస్య సుమతా అసత్."

ఈవధువు కూర్చుండుటకై సుఖకరమును శరీరరక్షకమును అగు చర్మము తీసికొని రమ్ము. ఓసినీవాలి! యీవధువు ప్రజావతి యగుఁగాక. దేవునియనుగ్రహ బుద్ధియందు ఈ వధువు ఉండుఁగాక. నీయనుగ్రహమున దేవుఁడును దీనిననుగ్రహించుఁగాక.

"గృహాన్ ప్రపాదయన్ వధూం వాచయతి."

ఇంటిలోనికిఁ దీసికొనిపోవుచు వధువుచే నిట్లు చెప్పించును:—

"గృహాన్ భద్రాన్త్సుమనసః ప్రపద్యేఽవీరఘ్నీ వీరవత స్సువీరాన్, ఇరాం వహతో ఘృత ముక్షమాణా స్తేష్వ హగ్ం సంవిశామి."

నేను పతిగృహమును పొందుచున్నాను. ఈగృహ మెట్టిది? మనోహరము. కోడలను చూచి సంతోషించెడు మంచి మనస్సు గల యుత్తమాము లీగృహమున నున్నారు.

ఈగృహమునందు దేవరుల (బావలయు మఱఁదులయు) పుత్త్రులు

ఉన్నారు వీరులగు రక్షకుల కాపలాలో ఉన్నది. అన్నసమృద్ధి గలది. ఘృతముక్షమాణము అనఁగా (బ్రాహ్మణులు భోజనము చేసినపుడు వడ్డించిన) నేతితో జిడ్డుగలది. ఇట్టి యీగృహమును బొంది అవీరఘ్నిని పుత్త్రుల హింసించుస్వభావము లేని నేను మంచిమనస్సు గలదానయి కూర్చుండుదును.

తర్వాత పదుమూఁడు మంత్రములతో హోమము చేయవలెను. ఆమంత్రములందు గృహస్థులకుఁ గావలసినకోరికలు కోరఁబడును. నూతనదంపతులు కోరుకొనువానిలో ముఖ్యమైనవి చూతము.

తమయంతరాత్మలనుగుఱించి తామే చెప్పుచున్నారు.

| | |
|---|---|
| "ఇహైవ స్తం వియౌష్టం విశ్వ మాయు ర్వ్యశ్నుతమ్, మహ్యా ఇంద్ర స్వస్తయే" | ఈ గృహమునందే యుండండి. ఎప్పుడును ఎడఁబాయకయుండండి. వేదోక్తమగు(నూటిపైనిపదియాఱు సంవత్సరములు) ఆయుస్సును పొందండి. ఇంద్రుఁడు మీకు సమృద్ధిని క్షేమమును గలిగించుఁగాక. |

| | |
|---|---|
| "ధ్రువైధి పోష్యా మయి మహ్యం త్వా దాద్బృహస్పతిః, మయా పత్యా ప్రజావతీ సంజీవ శరదశ్శతమ్" | ఓవధూ ! నాకు పోష్యురాలవగు నీవు నాయందు నిశ్చలబుద్ధి గలదాన వగుము. బృహస్పతి నిన్ను నాకు ఇచ్చినాఁడు. సంతానవతివై పతినయిన నాతోఁ గూడ నూఱు సంవత్సరములు జీవింపుము. |

ప్రవేశహోమానంతరము పఱచి యుంచిన చర్మముపైని వధూవరులు కూర్చుందురు.

| | |
|---|---|
| "ఇహ గావః ప్రజాయధ్వమిహాశ్వా ఇహ పూరుషాః, ఇహో సహస్ర దక్షిణో రాయస్పోషో నిషీదయతు" | ఓగోసముదాయమా ! ఈగృహమునఁ బుట్టుము. అశ్వసమూహమా ! ఈయింటఁ బుట్టుము. పూరుషులారా ! ఈయింట జన్మింపుఁడు. సహస్రదక్షిణుఁడగు ధనపోషుఁడు ఈయింటనే కూర్చుండుఁగాక. |

నూతనదంపతులాంగృహమునఁ జర్మాసనముపైని కూర్చుండి జీవపుత్త్రయగు నొకస్త్రీయొక్క కుమారుని వధువుయొక్క తొడపైని కూర్చుండఁ బెట్టి వరుఁడిట్లు చెప్పును.

| | |
|---|---|
| "సోమే నాదిత్యా బలిన స్సోమేన పృథివీ దృఢా, అథో నక్షత్రాణా మేషా ముపస్థే సోమ ఆధిత" | దేవతలు చంద్రునిచేత బలధారులయిరి. సోమునివలన ఓషధులు వృద్ధియగును. ఓషధులవృద్ధియున్నపుడే యాగముచేయ వీలగును |

గదా. పృథివియు సోముని చేతనే దృఢమైనది. సోముని చేతనే ఓషధి వనస్పతులు వృద్ధిపొంది భూమికి బలమునిచ్చును. ఈనక్షత్రముల మధ్యమున చంద్రుఁడు ఉన్నట్లే నీతొడపైని ఈబాలుఁడు కూర్చుండుఁగాక.

ముందుమంత్రము జెప్పుచు వరుఁడు ఆబాలునకు ఫలముల నిచ్చును.

"ప్రస్వస్థః ప్రేయం ప్రజయా భువనే శోచేష్ఠ, ఏనా పత్యా తన్వాగ్ం సగ్ంస్వజస్వాథా జీ వ్రీ విదథ మావదాసి"

ఓఫలములారా! మీరు ప్రసవించు (మొలకలు పెట్టు) స్వభావము గలవార లగుఁడు. ఈవధువు కూడ ప్రసవశీలురా లగుఁగాక. మీవలెనే మీయనుగ్రహమున నీమెయు మంచి సంతతిని బ్రసవించుఁగాక.

దీనితర్వాత నీ క్రింది మంత్రములు వరుఁడు చెప్పును.

"ఇహ ప్రియం ప్రజయా తే స మృధ్యతా మస్మిన్ గృహే గార్హపత్యాయ జాగృహి ఏనాపత్యా తన్వాగ్ం సగ్ం

ఓవధూ! ఈయింటిలో ప్రజ(సంతతి)చేత గలుగుప్రీతి నీకు సమృద్ధియగుఁగాక. దీనిచే (ప్రజాసంపత్తి చెప్పఁబడినది.) ఈగృహమందు గృ

ప్రజస్వాథా జీవ్రీ విదథమా వదాసి.”

హస్థధర్మములను (అగ్నిపరిచర్య, అతిథిసత్కారము మొదలగువానిని) నడిపించుటలో చాలజాగరూకత గలదాన వగుము. (దీనిచే ధర్మసంపత్తి చెప్పఁబడెను.) పతినైన నాతో నీశరీరమును గలుపుము. (దీనిచే కామసంపత్తి తెలుపఁబడినది.) ప్రజాసంపత్తి, ధర్మసంపత్తి, కామసంపత్తులు గలిగి వానిని చిరకాల మనుభవించి యాపైని జరదవస్థను (వార్ధకమును) బొందియజ్ఞాదివిషయమున చెప్పఁదగిన విషయములను పుత్త్రపౌత్త్రాదులకు ఇది యిట్లు చేయుఁడు అని ఆభిముఖ్యముతోఁ జెప్పుము.

## స్థాలీపాకము.

తర్వాత స్థాలీపాక మనుసంస్కారము గావింపవలెను. స్థాలియందు వండుట. హోమములకును బ్రాహ్మణభోజనమునకు సరిపడినవంట చేయుట దానికి సరిపడినబియ్యము పత్నిదంపి వండవలయును మఱి యొక మతమును పత్ని దంపుటయు, పతి వండుటయును చెప్పఁబడినది. ఆయన్నమునుండి అగ్ని మొదలగు దేవతలకు హవిర్భాగము లిచ్చి హవిశ్శేషముతో ఇద్దఱను

తక్కువకాకుండఁగ బ్రాహ్మణులను భుజింపఁజేయవలెను. అది మొదలు 'యావజ్జీవం హోష్యామి' అని ఔపాసనమును (అనఁగా అగ్నియందు రెండుపూటలును తండులములతో హోమము చేయుట) దంపతులు ప్రారంభింతురు. ఇది నిత్యము, యావజ్జీవము కార్యము.

## వివాహాంగబ్రహ్మచర్యము.

"త్రిరాత్ర ముభయో రథ శ్శయ్యా బ్రహ్మచర్యం, క్షార లవణర్జనం చ."

మూఁడురాత్రములు నూత్నదంపతులు ఏకశయ్యాగతులయి (మంచముమీఁదఁగాని వేఱువేఱుచోట్లఁగాని వారు పరుండరాదు) బ్రహ్మచర్యము (స్త్రీ పురుషునితోఁగాని పురుషుఁడు స్త్రీతోఁగాని స్పర్శాలింగనాదిసుఖములను పొందకుండుట) జరుపవలెను. ఇచట ఏకశయ్యపైఁ బరుండియుండుటచే కామవికారములకుఁ గారణము లున్నను నియమముతో నింద్రియములను నిరోధింపవలె ననుట ముఖ్య విషయము. ఇంద్రియవికారహేతువులగు క్షారము, (కారము) లవణము మొదలగునవి వర్జింపవలెను

"తయో శ్శమ్యా మంతరేణ దండో గంధలిప్తో వాససా సూత్రేణ వా పరివీతస్తిష్ఠతి.

ఏకశయ్యాగతులగు వారి పడుకకు నడుమ (పాలాశాది)దండము నుంచవలెను. ఆదండమునకు వస్త్రముచుట్టి గంధముపూసి ఆదండమునందు విశ్వావసుగంధర్వుని ఆవాహనముచేసి ఇద్దఱిమధ్యమున నుంచవలెను.

## గంధర్వప్రతిష్ఠాపనము.

ఈక్రింది మంత్రముతో గంధర్వుని స్థాపించవలెను.

"సుమంగలీరియం వధూరిమాగ్ం సమేత పశ్యత, సౌభాగ్యమస్యై దత్వా యాథాస్తం విపరేతన."

సౌభాగ్యవతియగు ఈవధువును వచ్చి చూడండి. చూచి యీమెకు సౌభాగ్యమును ఇచ్చి తర్వాత స్వేచ్ఛతో మీమీనివాసములకు దయచేయండి.

అని గంధర్వుని పూజించి వారిశయ్యనడుమను ఆదండముంచును.

"విశ్వావసో త్ర గంధర్వ దండే రాత్రిత్రయం వస, ఆవయోః ప్రీతి ముత్పాద్య రక్ష మాం శుభలక్షణమ్."

విశ్వావసుగంధర్వా! నీవు మూఁడు రాత్రులును ఈదండమందుండుము. మాకిద్దఱకును బ్రీతిని గలిగించి శుభలక్షణుఁడనైన నన్ను రక్షింపుము.

"వాచం యచ్ఛత్యానక్షత్రేభ్యః" దంపతు లుభయులును నక్షత్రో దయపర్యంతమును వాఙ్నియమనము (మౌనము) ను అవలంబింపవలెను.

"ఉదితేషు నక్షత్రేషు ప్రాచీము దీచీం వా దిశ ముపనిష్క్రమ్య ఉత్తరాభ్యాం యథాలింగం ధ్రువ మరుంధతీం చ దర్శయతి." నక్షత్రము లుదయించినతర్వాత తూర్పుగాఁ గాని ఉత్తరముగాఁ గాని పోయి ఈక్రింది మంత్రములతో యథాక్రమముగా వరుఁడు వధువునకు ధ్రువుని, అరుంధతీదేవిని జూపించును.

## ధ్రువదర్శనము.

"ధ్రువక్షితి ర్ధ్రువయోని ర్ధ్రువమసి ధ్రువత స్థితమ్, త్వం నక్షత్రాణాం మే థ్యసి స మా పాహి పృతన్యతః." ఓధ్రువా! స్థిరమైన నివాసము గలవాఁడవు. ధ్రువమైన ఉత్పత్తి గలవాఁడవు నీవే ధ్రువనక్షత్రముగానుండి ఇతరనక్షత్రములకు కాడివలె నున్నావు. కాడి ఎడ్లను తొలఁగిపోకుండఁగ చేయునట్లు నక్షత్రములు చలింపకుండఁగఁ జేయుటకై నీవు నడుమ నున్నావు. అట్టి నీవు మమ్ములను ఎదిరించుయోద్ధకాములనుండి రక్షింపుము.

## అరుంధతీదర్శనము.

"సప్తర్షయః కృత్తికానా మరుంధతీం యద్ధ్రువతాగ్ం హాని న్యుః, షట్కృత్తికా ముఖ్యా యోగం వహంతీయ మస్మాక మేధ త్వష్టమీ."

కశ్యప, అత్రి, భరద్వాజ, విశ్వామిత్ర, గౌతమ, వసిష్ఠ, జమదగ్నులను సప్తర్షులకును కృత్తికలను పేరుగలభార్యలు కలరు. వారిలో అరుంధతి యనునామె యేడవది. పతివ్రత కావుననే ఆమె ప్రధానురాలును నిశ్చలురాలును అయియుండెను. ఇతరకృత్తికలు వ్యభిచారశంకచేత విడువఁబడిరి. అని ఇతిహాసములలోఁ జెప్పుదురు. అదియిందు నుడువఁబడును.

కశ్యపాదిసప్తఋషులును ఎప్పుడు అరుంధతియందు నిశ్చలత్వమును కనిపట్టి ఆమెను కృత్తికలలో ప్రధానురాలుగాఁగావించిరో అప్పుడు షట్కృత్తికలును అరుంధతియందు ప్రధానభావమును వహించిరి. అట్లే ఈవధువు నాకు అష్టమి యగుఁగాక.

అనఁగా సప్తర్షులకును అష్టమస్థానముననే నుండును గాక. ఈవధువు

కృత్తికలకు అష్టమీస్థానీయురాలు
అగుఁగాక.

వివాహమునందు అట్లు త్రిరాత్రము బ్రహ్మచర్యవ్రతము సాగించవలెను. కావున స్థాలీపాకము మొదలు త్రిరాత్రము దీక్ష వహింపవలెను.

## సదస్యము.

సదస్య మనఁగా సభలోఁ జేయునది అనియర్థము. సభ గావించి యందు గణపతిపూజ, అష్టదిక్పాలకపూజ సరస్వతీ పూజయు చేసి విద్వజ్జనమహాజనులను సువర్ణపుష్పములతో పూజించి మహదాశీర్వచనము పొందుదురు.

## గంధర్వోత్థాపనము

"తం చతుర్థ్యామపరరాత్ర ఉత్త రాభ్యా ముత్థాప్య ప్రక్షాళ్య నిధాయ."

నాల్గవనాఁ డపరాత్రియందు ఆ గంధర్వదండము ఎత్తి కడిగి శయనముకంటె వేఱుచోట నుంచవలయును. దండము నెత్తునపుడు గంధర్వున కుద్వాసన మిట్లు చెప్పును.

"ఉదీర్ష్వాతో విశ్వావసో నమసేడామహే త్వా, అన్యా మిచ్ఛ ప్రఫర్వ్యగ్ం సంజాయాం పత్యా సృజ."

ఓ విశ్వావసూ! ఈశయ్యనుండి లెమ్ము. నమస్కారముతో నిన్ను వేఁడికొనుచున్నాము. ఏమని యనఁగా ప్రథమవయస్సుగల మరొక

కన్యకను నీవు కోరుకో. నాపత్నిని నాతోఁ గలుపుము.

"ఉదీర్ష్వాతః పతివతీ హ్యేషా విశ్వావసుం నమసా గిర్భి రీట్టే, అన్యా మిచ్ఛ పితృషదం వ్యక్తాగ్ం సతే భాగో జనుషా తస్య విద్ధి."

నాచేత పతివతియగు నాపత్ని విశ్వావసుఁడ వగునిన్ను నమస్కారముతోను వాక్కులతోను యాచించుచున్నది. ఏమని యనఁగా తండ్రిగృహమునందు వివాహము సమాప్తము కాకుండగ నున్న మఱొక కన్యను ఇచ్ఛింపుము. ఆ భాగము నీకు జన్మచేతనే యేర్పడినది; నీవు అందులకుఁ బుట్టితివి; కావున ఆభాగమును నీవు పొందుము.

## శేషహోమము.

వివాహశేషమున విధింపఁబడిన హోమము అగ్నివాయ్వాదిత్యాదిదేవతలకు హవిర్భాగములు ఇచ్చి ఈకన్యకుఁ గల సాముద్రికోక్తదుష్టలక్షణములవలనఁ గలుగుహాని రాకుండఁగఁ దేవతలను బ్రార్థించును.

"అగ్నే ప్రాయశ్చిత్తే త్వం దేవానాం ప్రాయశ్చిత్తిరసి బ్రాహ్మణ స్త్వా నాథకామః ప్రపద్యే యాస్యాం పతిఘ్నీ తనూః

ఓ అగ్నీ! నీవు నష్టమగుకర్మను తిరిగి సంధానము చేయు స్వభావము గలవాఁడవు గావున నీకు దేవతలలో ప్రాయశ్చిత్తి యను

ప్రజాఘ్నీ పశుఘ్నీ లక్ష్మీఘ్నీ జారఘ్నీ మ స్యైతాం కృణో మి."

పేరు గలిగెను. నాథుని (సంరక్షకు ని) కోరినవాఁడను. బ్రాహ్మణుఁడను. నేను నిన్నుఁ బొందుచున్నాను. ఈవధువునకు పతిఘ్ని (పతిహింసను చేయునట్టి) చేతిలోని రేఖలు మొదలగు నేయవలక్షణము గలదో అట్లే ప్రజాఘ్ని, పశుఘ్ని, లక్ష్మీఘ్ని యగు నేయవలక్షణములు గలవో ఆదుర్లక్షణములను జారఘ్నులుగా (జారులను చంపునవిగా) పరిణమింపఁజేసెదను నేను చేయఁదలఁచిన కార్యము నిమిత్తము పై దానిని సిద్ధింపఁజేయుటకై నిన్నుఁ బొందుచున్నాను.

"వాయో ప్రాయశ్చిత్త ఆదిత్యప్రాయశ్చిత్తే ప్రజాపతే ప్రాయశ్చిత్తే త్వం దేవానాం ప్రాయశ్చిత్తి రసి బ్రాహ్మణ స్త్వానాథకామః....కృణోమి."

దీనిభావము పైదానివలెనే అన్వయించుకోఁ దగును. వేఱువేఱు దేవతలను పైరీతిని ప్రార్థించును.

తర్వాత వేఱువేఱు దేవతలను గుఱించి వేఱువేఱు ద్రవ్యముల ప్రాప్తికై ప్రార్థనములు దెలుపు మంత్రములతో హోమములు చేయఁబడును.

## నాకబలి.

"నాగవిల్లి" అని యందురుగాని "నాకబలి" యనవల యును. దేవతలకు బలులు ఇచ్చుచు చేసెడి పూజ అని యర్థము. ఇది ఆపస్తంబుఁడు చెప్పకపోయినను వృద్ధాచారప్రాప్తము. ఇది దేశీయజనులలో నుండెడి యొక కర్మకు వైదికత్వము కల్పించిన కర్మవిశేష మయియుండును. దీనికి పూజాదివిధానమున మంత్రములను విధించు సూత్రము లేకున్నను అనేకదేవతా నామములతో నున్న మంత్రపఠనము బలులతర్వాత చేయుచున్నారు.

యుద్ధవిజయాది సమయములందు దుర్గదేవతాదులకు ఇచ్చెడి బలులవలెనే వధువు వివాహానంతరము నిర్విఘ్నముగా పితృగృహమునుండి పతిగృహమునకువచ్చి యక్కడ సర్వాధిపత్యము సంపాదించినదిగాన దృష్టిదోషాదిపరిహారమునకును చేసెడి దేవతాబలులు కావచ్చును. దీనిప్రక్రియ యిట్లుండును. బియ్యపుఁబిండి, పసుపు, కుంకుమలతో (తెలుపు, పసుపు, ఎఱుపు మూఁడు రంగులద్రవ్యములతో) నాలుగు పలకలుగా పట్టు పెట్టుదురు కొందఱు ఏనుఁగుల యాకారములుగా పట్టుపెట్టుదురు. దాని చుట్టును ముప్పదిరెండు చిన్న పిడతలును విదిక్కులయందు నాలుగు పెద్దపిడతలు పెట్టి ఆపెద్దపిడతల కంఠములకు నలుదిక్కులు తిరిగివచ్చునట్లు దారములు పోసి కట్టుదురు. చిన్నపిడతలలో మూఁడిటిలో ఉప్పు, పప్పు, బియ్యము వేసి యుంచి నలుదిక్కులను నాలుగు దీపము లుంతురు. ముప్పదిమూఁడు

దీపములు (ఇవి ముప్పదిమూఁడుకోట్ల దేవతలకు ప్రతినిధులని తోఁచును.) వెలుఁగుచున్న కంచుపళ్లెరములు పట్టుకొని ఇద్దఱు సువాసినులు తెత్తురు. దంపతులు వారికి ప్రదక్షిణములు చేయుదురు.

ముప్పదిరెండు అన్నకబళములు గూడ నుంచవలెనని కొందరందురు. కొంద రట్లన్నకబళము లుంచుటలేదు. దంపతులు దానికిఁ బ్రదక్షిణముచేసి ఉపహారాదికము ఇచ్చి తంతువులు (చుట్టుఁజుట్టినదారములు) తీసివేసి నాలుగుదిక్కులందును అర్ఘ్యములు ఇచ్చెదరు సర్వదేవతల నామములు గలయంత్రములు పఠింతురు

"అగ్నిర్దేవతా వాతో దేవతా
సూర్యో దేవతా చంద్రమా దేవతా."

... ... ... ... ...
... ... ... ... ...

మూఁడురంగుల పట్లుపెట్టి చుట్టును దారములు కట్టి దీపములు వెలిఁగించి యలంకరించుట యంతయును ఒకదుర్గము సూచించును దంపతులు బలులిచ్చి దారముతీసివేసి కోటలో ప్రవేశింతురుగాఁబోలు. ఇది ప్రోలులో ప్రవేశించుట కాఁబోలు. కావుననే కాఁబోలు దీనికి ప్రోలు అని పేరువచ్చినది. ఆసమయమున వధువునకు పట్టుచీర బహుమాన మిచ్చెదరు. దానిని ప్రోలులో పట్టుచీరయందురు. ఆచీరమూలముననే యీ 'నాగవిల్లి'కి ఇంత ప్రాముఖ్యము గలిగియుండును. దీనికి

మూలము ఏమున్నదో యింకను అన్వేషింపవలసి ఉన్నది. నాక బలి దాక్షిణాత్యులలో లేదు.

## దండాడింపు.

నాకబలి యయినతర్వాత విజయసూచకముగా ఉత్సాహముతో దంపతులు నరవాహనులయి బుక్కాభర్గుండలతో వినోదయుద్ధము చేయుదురు ఇట్టివి ఏసందర్భముననో వచ్చిన యాచారములు. కొన్ని నిలిచియున్నవి. తాత్కాలికస్థితి కనుకూలముగా లేనపుడు వానిని విడిచిపెట్టెదరు.

## ఒక పరీక్ష లేక వేడుక.

రెండు బిందెలలో నీళ్లు పోసి వాటిలో వెండినగ యొకటియు బంగారునగ యొకటియు పడవేసెదరు. దంపతులలో వరుఁడు మొదటి పర్యాయము బంగారునగ తీయవలెను వధువు వెండిది తీయవలెను. రెండవమారు వధువు బంగారుది, వరుఁడు వెండిదియు తీయవలెను. మూఁడవమారు మొదటిమాటువలె తీయవలెను అట్లు చేయుట భావి శుభసూచకము. దంపతులలో నెవరు చులుకుగలవారో కొంత తెలియును. ఇదియొక భావి శుభపరీక్ష చూచుటవంటిది లేదా వేడుక యనవచ్చును రెండును కలియవచ్చును.

## కుత్తుకంటు.

కుత్తుకంటు కుత్తుకను అంటుకొనియుండు నగ. ఇందు ఎఱుపు నలుపు (నీలలోహితములు) గల పూసలు ఎఱ్ఱపూసలు

నల్లపూసలును గలిపి గ్రుచ్చినదిగాన నీలలోహితము అని కుత్తుకంటునకు పేరుపెట్టిరి. అందలి దేవతకు నీలలోహిత దేవత అను పేరుపెట్టిరి. అందు గౌరీపూజతో వీనికిని పూజచేసి పప్పు బియ్యము కలిపి వండినయన్నము, (పులగము), నివేదన చేసెదరు. దీనికిని ఒకమంత్రము నీలలోహితశబ్దము గలది గ్రహించిరి.

"నీలలోహితే భవతః
కృత్యా స_క్తి ర్వ్యజ్యతే,
ఏధంతే స్యా జ్ఞాతయః
పతి ర్బంధేషు బధ్యతే."

ఈమంత్రముతో కుత్తుకంటు కట్టి "నీలలోహితధారణ ముహూ_ర్తస్సుముహూర్తోఽస్తు" అందురు. ఇది పతిజీవనాంతమువఱకును విడువరాదు. ఇదియును ఆచారమాత్ర మూలకమే.

హోమమునం దుపయోగింపఁగా మిగిలిన నేయి వధూశిరస్సుపై విహితమగు మంత్రములతో నుంచవలెను.

## ప్రేమదర్శనము.

ఈ క్రిందిమంత్ర ముచ్చరించుచు వధువు వరునిఁ జూచును.

"అపశ్యం త్వా మనసా చేకితా
నం జాతం తపసో విభూతమ్,
ఇహ ప్రజా మిహ రయిగ్ం
రరాణః ప్రజాయస్వప్రజయా
పుత్త్రకామ."

ఓపుత్త్రకామా! నేను నిన్ను మనస్సుతో అనఁగా స్నేహయు_క్తముగా చూచుచున్నాను నా హృదయము నీవెఱుఁగుదువు. నీవు తపస్సున (గర్భాధానాదిసంస్కార

ములచేతను), బుట్టినవాఁడవు. తప
స్సుచేత అనఁగా, బ్రహ్మచర్యవేదా
ధ్యయనాదులవలన బాగుగా వృద్ధి
పొందినవాఁడవు. ఈగృహమందు
ప్రజను ధనమును ఇచ్చువాఁడ
వై సంతతిరూపమున నాయందుఁ
బుట్టుము.

వరుఁడు వధువును చూచుచు ఇట్లనును.

"అపశ్యం త్వా దీధ్యానాగ్ం స్వాయాం తనూగ్ం బుత్వియే నాథమానామ్, ఉపమాముచ్చా యువతి ర్బభూయాః ప్రజాయస్వ ప్రజయా పుత్ర కామే."

ఓపుత్త్రకామా! ప్రియురాలా! నేను నిన్ను మనస్సుతో అనఁగా స్నేహయుక్తముగా చూచుచున్నాను. నీవు నావలన నీశరీరమందు గర్భమును అపేక్షించుచున్నావు. నీవు యౌవనవతివి నావలన భోగమును పొంది సంతతిరూపమున జన్మింపుము. అనఁగా సంతతిని గనుము.

## హృదయసంసర్గము.

హోమము చేయఁగా మిగిలిననేతితో ఇద్దఱిహృదయములను వరుఁడు స్పృశించును.

| | |
|---|---|
| "సమంజంతు విశ్వే దేవా స్స మాపో హృదయా ని నౌ, సం మాతరిశ్వా సంధాతా సముదే ష్ట్రీ దిదేష్టు నౌ." | విశ్వేదేవతలు మనహృదయము లను స్నేహముతోఁ గలసినవాని నిగాఁ జేయుదురుగాక. జలదేవత, వాయుదేవుఁడు, ధాతయు మనహృదయములను స్నేహమునఁ గలసిన వానినిగా గావింత్రుగాక పరస్పర సంభాషణశక్తి నిచ్చు సరస్వతి సంగమకాలమున అనుకూలమయిన సంభాషణమును మనచేత చేయించుఁగాక. |

తర్వాత వరుఁడు ఈక్రింది జపము చేయును.

| | |
|---|---|
| "ప్రజాపతే తన్వం మే జుషస్వ త్వష్ట ర్దేవేభి స్సహసా మ ఇంద్ర, విశ్వైర్దేవై రాతిభి స్సగ్ం రరాణః పుగ్ంసాం బహూనాం మాతర స్స్యామ." | ప్రజాపతీ! నేను రేతస్సేకమునకు సమర్థుఁడ నగుటకై నీవు నాశరీరమందుఁ బ్రవేశింపుము. రూపనిర్మాణమందు సమర్థుఁడవగు ఓత్వష్టా! నీవును నాశరీరమునఁ విష్ణ్వాదులతో ప్రవేశింపుము. ఓఇంద్రా! నీవు నీమిత్రులగు సమస్తదేవతలతోను నాశరీరమునఁ బ్రవేశించి మాకోరికలను ఇచ్చుచు మేము బహుపుత్త్రులకుఁ దల్లిదండ్రుల మగునట్లు చేయుము. |

"ఆనః ప్రజాం జనయతు ప్రజాపతి రాజరసాయ సమనక్త్వర్యమా, అదుర్మంగలీః పతిలోకమావిశ శం నో భవ ద్విపదే శం చతుష్పదే."

ప్రజాపతి మాకు సంతతిని గలిగించుఁగాక. అర్యముఁడు వార్ధకము వచ్చువఱకును మమ్ములను స్నేహాయుక్తులను చేయుఁగాక.

ఓవధూ! నీవు సౌభాగ్యవతివై పతినైన నాగృహముననివసింపుము. మాద్విపాత్తులకు చతుష్పాత్తులకు (రెండుపాదములు గలజంతువులకును నాల్గుపాదములు గలజంతువులకును)సుఖకారకురాల వగుము.

దీనితర్వాత దంపతులరహస్యసమావేశాదులను, తద్రీతులను తెలుపుమంత్రములను వరుఁడు జపించును.

## కంకణవిమోచనము.

రక్షాబంధనములు విప్పుట. ఇది నాల్గవనాఁటి రాత్రి చేయఁదగినది.

## మిథునవిడియములు.

నూతనదంపతులు ప్రాఁతదంపతులకుఁ దాంబూలముల నిచ్చెదరు. మిథునము అనఁగా స్త్రీపురుషద్వంద్వము. వారివలనఁ బ్రజావృద్ధిగలుగుటను సూచించు 'ద్వంద్వంవై మిథునం"...... ఇత్యాదిమంత్రములను పఠింతురు.

## అప్పగింతలు.

'అష్టవర్షా భవేత్ కన్యా పుత్రవ
త్పాలితా మయా, ఇదానీం
తవ దాస్యామి దత్తా స్నేహేన
పాల్యతామ్''

కన్యాదాత వరాదులకు కన్యకను అధీనముచేయును. అష్టవర్షములు గల యీకన్యక నాచేత పుత్త్రుని వలె పెంచఁబడినది.

ఈకన్యకను నీ కిచ్చుచున్నాను. దీనిని స్నేహముతో పాలింపుము.

ఈరీతిగా వరుని తల్లిదండ్రులు మొదలగువారికిని వారి వారివరుసలు చెప్పుచు కన్యాదాత కన్యకను అప్పగించును. కన్యకచెయ్యి పాలలో ముంచి వరాదులచేతిలోఁబెట్టి యిచ్చి "మాపిల్లను స్నేహముతో కాపాడండి'' అని యప్పగించునపుడు "చెయ్యప్పగించి'' మొదలగు పాట పాడినప్పుడును, ఎంత ధైర్యముగల తల్లిదండ్రులకును బాష్పములు రాకమానవు.

అష్టవర్షములు పెంచినవారికే అంతవిచార ముండునపుడు (అష్ట + అష్ట) రెండుఅష్టవర్షములు (పదాఱు) వత్సరములు పెంచినవారికి రెట్టింపువిచారము గలుగును.

అల్లుఁడును కూఁతురును ఆనందముతో ఉండఁగా చూచి నపుడు రాకమాననివి ఆనందబాష్పములు.

ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్

---

చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము:—1939.